# ధైర్యజీవి

రచయిత:.

శ్రీ జంపన చంద్రశేఖరరావు,

బి. ఏ., ఆనర్సు బి. ఇడి.,

అన్నామలై యూనివర్సిటీ,

అన్నామలై నగర్.



చంద్రయ్యా అండు కో.,

పబ్లిషర్సు & బుక్ సెల్లర్సు,

రాజమండ్రి.

1944.



[ వెల 0-8-0



# సూచన.



భారతదేశములోని పెద్దసంఘ దురాచారము బాల్యవివాహము—
అందువల్లకలిగిన అనర్థములు పెక్కులు. మొదటిది వైధ
వ్యమువలన భారతీయకన్యలు ఎందరు తమ జీవి
తాలను అడవిని కాసిన వెన్నెలపగిది భగ్నం
చేసికొని కృశించి జీవితములను భగ్న
ప్రేమలతో మృత్యుదేవతకు అర్పించు
చున్నారో ఈ సంఘము గాంచు
చున్నదా ?

అట్టి ఒక భగ్నజీవియొక్క భగ్నహృదయమును ఇందు వివరించాను.
ఆ ప్రేమైక జీవియొక్క మానసికాందోళన, ప్రేమకు, సంఘము
నకు గల వైరము, చివరకు తల్లిదండ్రులుకూడ వారి వారి
కుమార్తెల అధోగతిని గుర్తించియు, నిస్సహాయులై
కర్మను నిందించుట మొదలయిన విషయములు
సూచించ బడ్డాయి.

చంద్రం.



బాక్ను ప్రెస్, రాజమండ్రి.

# 1

నాలో ఇంకా యౌవన సౌందర్యం నసించలేదు.

నా కన్నులలో కాముక జ్వాల, ఇంకా కాలవాహినిచే ఆరి పోలేదు.

నా హృదయ పాత్రిలో అనురాగామృతం ఇంకా అంతరించి పోలేదు.

కన్నీటిచే పెంచుకుంటున్న నాజీవిత వల్లరి, ఇంకా వాడిపోలేదు.

ఇలా ఎంతకాలమో !

ఆనంద వనములో ఆల్లుకొన్న ఆశా పుష్పాల నింకా నా ప్రణ యాధి దేవత, కోసుకుంటూనేఉంది. వేణీభరంలో కూర్చుకుంటూనే ఉంది—గోర్వెచ్చని తేనెను తుమ్మెదలకు పంక్తిభోజనం పేడుతునే ఉంది—

ఇలా ఎన్నాళ్ళు ?......—

ఆకాశ సౌధంలో అనందంతో ఆరిపోని దీపాలను వెలిగించే ఆ ముత్తయిదు ఎవరో అహర్నిశం నా హృదయ మందిరంలో ఆరిపోని ప్రేమజ్యోతులను వెలిగించే ఈకర్మ దేవత ఎవరో ? ఆ కాశంమీద వెలిగే దీపాలకు—హృదయంలో మండే ప్రేమజ్వాలలకు ఏనాటి సం బంధమో ? ఏనాటి బాంధవ్యమో ?

వాటి బ్రతుకు తెల్లవారగానే అవి మబ్బుమాటున మణిగి పోతాయి—

నా బతుకు తెల్లవారగానే ఇవి నేలమాటున రాలిపోతాయి—

అంతవరకు ఒక దాని నొకటి చూచుకొని

అర్థంకాని భావాలేవో వ్యక్తం చేసుకుంటాయి—

ఆడుకుంటాయి—

ఆటలో అనురాగాన్ని దిద్దుకుంటాయి.

పాడుకుంటాయి—

పాటలో పరవశాన్ని పొత్తుకుంటాయి.

నవ్వుకుంటాయి—

నవ్వులో ముత్యాలు కూర్చుకుంటాయి.

వాటికి వాటికి ఏనాటినుంచి విడిపోని పరమసంబంధ బాంధవ్యం ఉన్నదో! ఎలా తెలుస్తుంది?

ఊహ కందుతుంది కాబట్టి— ఊహిస్తామా?

భాష కందుతుంది కాబట్టి—భాషిస్తామా?

వాక్కు కందుతుంది కాబట్టి—వచిస్తామా?

ఏమీ చేయలేము—

ఇలా ఎన్నో చేయలేము—

ప్రపంచకంలో ఉండే ప్రతి పదార్థంయొక్క పరమార్థం భావించగలమా? వచించగలమా?

ఎన్నో వస్తువులు నిరర్ధకంగా తెరమాటున మణిగిపోతున్నాయి.

ఎన్నో ప్రాణులు నిరర్ధకంగా భూగర్భంలో బూడిదైపోతున్నాయి.

ఎందరీ ప్రపంచకం అంచులమీాద జీవితాలను భగ్నం చేసుకుంటంలేదు?

వారి అందరి ఆక్రందనాలు వింటున్నారా ?

విని సానుభూతి చూపుతున్నారా ?

చూపితే ఎలా ?

ఈభగ్నజీవి కూడా చూస్తుంది లెండి...

*　　*　　*　　*

నన్ను చూచి ఎందుకో ఈలోకం, ఇలా విరగబడి వెకిలినవ్వు నవ్వటం ?

నావెనుక ఎందుకో ఈపిరికిలోకం, గుసగుసలు చెప్పుకుంటూ ఉండటం ?

నాజీవితాన్ని ఎందుకో ఈదరిద్రలోకం, కూకటివేళ్ళతో పెరుకుదామనుకుంటం ?

నేనే మహా కాముకరాలనని—ఈసిగ్గులపేమ స్వరూపులు నిందిస్తారా ? నేనే మహావ్యభిచారిణినని ఈ పతివ్రతా శిరోమణులు పరిహాసిస్తారా ? నేనే బహుభర్తృకనని, ఈ ఏకపత్నీవ్రతులు హేళన చేస్తారా ?

దాని తప్పుడుబుద్ధి అది దిద్దుకోకుండా, నన్ను 'కులట' గా చూస్తేమాత్రం ఈ గుడ్డిలోకాన్ని ఎవరు లెక్కచేస్తారు ?

కనుఃఉన్నవి కాబట్టి కనబడుతుందా ?

నిజానికి—

ఓ పతివ్రతా శిరోమణులారా !

పావలా మందాన్న పసుపు పూసుకొన్న పుణ్యాంగనలారా !

కొండంత కుంకుమబొట్టు దిద్దుకొన్న కులస్త్రీలలారా !

ఏదీ !

మీ హృదయాలమీద మీరు చేయ వేసుకొని చెప్పండి.

మీలో ఎంతమంది పతివ్రతలున్నారో ?

పరపురుషుడ్ని ఒకసారి భావించనైనా భావించని, భాగ్యశాలిను లెంతమంది ఉన్నారో వేలు మడవండి ?

ఠండి ! రచ్చకెక్కండి !

పతుల ప్రక్కలనుంచి బయటకురండి—ఊఁ......

ఎందుకలా నవ్వటం ?

హృదయాన్ని విప్పి చూపెట్టండి ? ఒకొక్కరి హృదయంలో ఎంతమంది విటులుంటారో లెక్కపెట్టండి ? చూస్తాను—

మీలో నూటికి అరవై మంది వ్యభిచారిణులను చూపిస్తాను— ఏభై మంది పశుప్రవృత్తిచే బ్రతికే కామినులను చూపిస్తాను.

పసుపు రాసుకొన్నంత మాత్రాన్న పతివ్రతలని అనుకోకండి.

పతి మాటున చేసే మహా పాపాలు ;

పతి యింట లేనప్పుడు పరపురుషునిచే కనే పాపపు సంతానం ;

మరచిపోయారా ? ఎంతకాలం ?

మరణశయ్యలమీద, మీమీ పాపాలన్నీ మహాగ్నిజ్వాలలుగా మిమ్ములను కబళించే నాడైనా మరచి పోతారా ? మాట్లాడరేం ?

మీరు లోకం కన్నులుమూసి పాపపు కృత్యాలుచేశారు కాని మీ కన్నులు మీరు మూసుకోగలిగారా ?

మీకన్నులను మూసుకొన్నా మీమనసును మూసుకోగలిగారా ?

ఆలోచించండి ?

నటనకు తావునిస్తే వినాశనం తప్పదు సుమండీ ?

మీ మీ భర్తలయెదుట, అత్తమామల యెదుట, మహాపతివ్రతల్లాగ సంచరిస్తే సంచరించ వచ్చును—సంఘం యెదుట అన్నం పున్నం ఎరుగని నంగనాచల్లాగ మెలుగుతే మెలగవచ్చును—కాని భగవంతుని యెదుట—మీరు నటించగలరా ? అక్కడ మీ ఆటలు సాగుతాయా ?

మనం సమాధానం చెప్పవలసింది. సంఘానికికాదు—భగవంతునికి. మన శరీరాలనుకాదు త్యాగం చేసుకోదలచింది—మనమనస్సులను......

తెలిసిందా అండీ...పతివ్రతల్లారా !

* * * *

ఓ హో హో ! మీరెవరు మీసాలు మెలివేసి మరీ నవ్వుతున్నారు. జర్మనీ వీరుల్లాగ అనడకలేమిటి ? తాగినవారిలాగ అకళ్ళు తిప్పటమేమిటి ? ఎందుకా ఉపన్యాసాలు దేనిగురించి ?

ధర్మంగురించా పతివ్రతా ధర్మంగురించా ?

ఆహా ! ఎంతతీయగా చెబుతున్నారు ? ధర్మం మూడుమూర్తులా రూపు దాల్చినట్లున్నారే ? ఏమి శాస్త్రనిష్ణాతులు ? ఏమి ధర్మోపన్యాస ధురంధరులు ?

తాడిచెట్లు తలలూపినట్లు, తలలూపే స్త్రీ రత్నాలు. మంగళ గీతాలుపాడే మానినీ శిరోమణులు, పూలమాలాలంకృతంచేసే పుణ్యాంగనలు...

ఓహోహో ! ఏమి వైభోగం. ఆఉపన్యాస వేదికపైన నిలబడి, హృదయాలు కరిగేటట్లు, రాళ్లుసహితం ద్రవించేటట్లు, ప్రకృతి పరవశంపొందేటట్లు ఏమి చక్కగా ఉపన్యసిస్తున్నారు ?

ఏదీ ఇలా చూచి చెప్పండి?

మీరు ఉపన్యసించే ఉపన్యాసంలో ఒక్క వాక్యంయొక్క పరమార్థమైనా ఆచరణలో పెట్టారూ? ఆచరణలేని సుభాషితాలెందుకు చెప్పండి? ప్రపంచకాన్ని మోసగించటానికేనా? ప్రపంచకాన్ని మోసగించాలని, మీరు మోసగింపబడటానికేనా!

ఆచేతిలో పుస్తకమేమిటి?

ఆర్ష ఋషులు జీవితాలకు చక్కని సూత్రప్రాయమైన వ్యాఖ్య నిచ్చిన 'భగవద్గీతేనా?'

ఉపనిషత్సారమైన 'భగవద్గీతేనా?'

పంచమ వేదమగు భారత విరాణ్మూర్తికి హృదయస్థానమైన 'భగవద్గీతేనా'

ప్రపంచ ప్రఖ్యాతగ్రంథమగు 'భగవద్గీతేనా'

మహాశయా!

అత్యుత్తమమై; ఆనంద సంధానమై; అనురాగ నిధానమై; అద్భుతశాంతి సందేశినియై; ఆత్మావలోకమునకు మార్గగామినియై; అరచేతిలో నిర్వాణపదాన్ని నిలిపే శ్రీభగవత్‌గీత నుచ్చరించే ఆపాప భూయిష్ఠమైన నాల్కతో, ఎందరి నవయౌవ్వన విలాసినుల, మధురాధర సుధారస ధారల నాస్వాదించారో ఆలోచించండి? అవి సుధారస ధారలా? చొల్లుగీటి కాల్వలా? గుర్తించండి మనోమందిరాన్ని ఆత్మాభిమానమనే తలుపులచే మూయకండి—తలుపులు తెరువండి—మీకు స్పష్టంగా తెలుస్తుంది—మీమనసులో విషసర్పాలెన్నున్నాయో మీకే తెలుస్తుంది—పరస్త్రీలమహత్తర మానాభిమానాలను మంటపాలుజేసి—మమతలుడుగని కౌగిలిలో మసిపూసి మారేడికాయ జేసి—'ప్రేయసీ!

ప్రేయసీ !—అని మనసార—చవులూర—కరువుతీర— పిలచిన ఆపాప వరి దగ్గమైన నాల్కేనా ఈమహా శ్వేర గ్రంథాన్ని చదువుతుంది ? ఛీ ! ఛీ !

ఓ గురువుగారూ !

మతసూత్రాలను చర్చించే మనసుతో—టి—మగనాలుల నెంత మందిని చింతించారో చెప్పండి ? భాష్యసూత్రాలను తర్కించే ఆ పెద వులతో—బూజుపట్టిన ఎందరి బుగ్గలను ముద్దుగొని ముగ్ధులైపోయారో ఆలోచించండి...

ఎందుకండీ ఈ భక్తుల వేషం ?

ఎందుకండీ ఈ భగవత్. గీతోపన్యాసాలు

పరులను వంచించ టానికేనా ?

అమాయకులను అన్యాయం చేయటానికే ?

ఆచరణ శూన్యములైన ఆ సుభాషితాల వలనేనా, అఖిలభారత భూవలయాన్ని అరచేతిలో పట్టుకొంటం ?

ఓ అధ్యాత్మిక సామ్రాజ్య చక్రవర్తిగారూ !

అన్ని శ్లోకాలు కంఠతా పట్టారుగానీ, ఒక్క శ్లోకంలో పరమార్థమైనా ఆచరణలో పెట్టగలిగారా ? మతమనే చొక్కా వేసుకొని హిందూదేశాన్ని తేలికగా మోసం చేయవచ్చునని వివేకానందులు ఊరికనే అన్నారా ?

మీవంటివారిని చూచేగా ?

మతం పేరుచెప్పి ఎన్నిమాయలు చేస్తున్నారండీ.

మహాశయా !

ఇటువంటి మహాశయులేనా పురుషుని పునర్వివాహానికి అనుజ్ఞ యిచ్చి—అబలమై అనాథమైన స్త్రీనిధవా వివాహాన్ని ' అరికట్టించింది ?

సంఘురథాన్ని నడిపే సారథికదండీ మీరు ? మీరేగా మాకు శాసన కర్తలు—అందుచేతే పవిత్రమైన హిందూమతం అధ్ధానమైపోతూంది దిగండి—దిగండి.

సంతోషించాంగాని ఆగద్దెనుండి దిగండి—

అహ్హాహా !

మీరేనా నన్ను వ్యభిచారిణి అన్నది.

మీకేనా నాముఖంచూస్తే అసహ్యం.

మీకేనా నాజీవితం తలుచుకుంటే రోత

అవునులెండి.

మీలాగ నాకు నటనలు చేతకావు ?

మీలాగ నాచేతిలో అధికారంలేదు.

మీరు మగవారూ—అన్నిటికీ సమర్థులు—

ఆడదాని బ్రతుకుమీద బండలుమోపే బలశాలులు.

ఛీ, ఛీ—మీవంటి తుచ్ఛజీవితాలకు సిగ్గుపడరేం ?

ఏమండోయ్ !

భక్తశిరోవతంసములారా !

సోదరీమణులారా !

దయచేసి ఉపన్యాసం విన్నారుగాని లేవంటి—మీ మీయిండ్లకు పోయి భర్తలకు సేవలుచేసి, వారిని ప్రేమచేదయించి, దుష్కామా న్నుంచి మరలించి, జీవితాలవైపు సింహావలోకనం చేసుకొని దిద్దుకొని, శాశ్వతశాంతి ప్రదమైన నిర్వాణాన్ని పొందండి. ఊ—లెండి—అలా పైటలు సవరించుకొంటూ, ముసుగులు సవరుకుంటూ వెట్టిముఖాలు

వేసుకొని చూస్తారెందుకు, లేవండి—పిల్లల్ని చంకలో పెట్టుకొని వెళ్ళండి—

భక్తులు బ్రతికిఉంటే పరాయపురుషుని భగవద్గీతోపన్యాసం వినటానికి వచ్చారా? వీరేమైనా మహాత్మాగాంధీగా రనుకున్నారా! రామకృష్ణ పరమహంస అనుకున్నారా! రమణమహర్షి అనుకున్నారా! అరవిందఘోషు అనుకున్నారా! మనసూ మాట ఒక్కటయ్యే మహాత్ములనుకున్నారా! చదివింది ఆచరణలో పెట్టే జ్ఞానయోగులనుకున్నారా! కర్తవ్యాన్ని నెరవేర్చే కర్మయోగులనుకున్నారా?

వట్టి మాయవేషధారులు; స్త్రీ లోలులు; త్రాగుబోతులు; తుచ్ఛులు; నీచులు; నరకతుల్యులు—తెలిసిందాఅండీ అమ్మలక్కల్లారా!

మీభర్తృసేవకంటే మహత్తరశక్తి నిచ్చేవారెవరు? మీభర్తలకు ఆనందం కలిగించే దానికంటే స్వర్గసుఖం ఉన్నదా? మీభర్తలను లాలించే దానికంటే నిర్వాణం ఉన్నదా? లేవండి—లేవండి—

భక్తురాండ్రవేషాలుమాని భర్తలసేవలు చేయండి. మీరే మహాపతివ్రతలని మాబోట్లను దూషించకండి ఎవరి మంచిచెడ్డలను వారి మనఃప్రవృత్తులే నిర్ణయించుకుంటూ ఒకరిమంచిచెడ్డలను నిర్ణయించటానికి మనమెవరం? ఎవరిహృదయ నిగూఢ భావనలు ఎవరికి తెలుసునని—

"వీరిటువంటివారు" అని పట్టిచూపెడతాను.

మేటర్లింక్ (Mater-link French) అన్నట్లు సృష్టిలో ఒకటే విచిత్రం—

ఏమిటంటే—

ఇద్దరు దగ్గరగా జేరితే—ఒకరిహృదయం ఒకరికి తెలియకపోవటమే అందుచేత 'వ్యభిచారిణి' అని నన్ను నిందించి—ఈగురువుగారి కాము తృష్ణకు మీరు ఆహుతిగాక—మీమీ భర్తలసేవలు చేసుకొని తరించండి—వెళ్ళండి—లేవండి—శలవు—ఇంక ఈపూటకు ఉంటాను.



## 2

"ఏటి పనియిది లోకమా! హృదశా దశన
దారుణ మహాగ్ని కార్యంబు దలచి నావు;"

అబ్బా! ఎంతబాగా చెప్పారండీ! కృష్ణశాస్త్రిగారు. నిజానికి లోకానికి ప్రణయమధురిమ తెలియదు. లోకం తానుస్వేచ్ఛననుభవించలేదు. అనుభవించేవాళ్ళను అనుభవించనీయదు—స్వాతంత్ర్య విహారులను శాస్త్రశృంఖలాలచే బంధిస్తుంది, పాపమనదు, జాలిలేదు తుదకు కంటతడికూడా పెట్టదు.

ప్రేయోపాసకుల జీవితాలను పిండి పిప్పి చేస్తుంది—వారి వేడి రక్తాన్ని పాదాలకు పారాయణగా పూసుకుంటుంది—కాని......

ధనోన్మాదులకు దాసోహం చేస్తుంది

త్రాగుబోతులకు తలలొగ్గుతుంది
కపటనటకాలకు కమిలిని కూరుస్తుంది.

ఇంతకూ—

లోకం తలపట్టుకొని ఎవడు క్రిందకువంచుతాడో, వానికి తానే తలనొగ్గి దాసోహంచేస్తుంది. లేకపోతే తలెక్కి పిండికొడుతుంది. రెక్కలను ఖండించి రివ్వుమని దిగ్గగంతాలకు విసరివేస్తుంది. కారే కన్నీటి కాలువలో కాళ్ళు కడుగుకొంటుంది.

ప్రేమిప్రేమికులను వేరుచేస్తుంది, వారి జీవితాలను భగ్నము చేస్తుంది, ఆ భగ్నజీవితాలపైన భయంకర నృత్యంచేస్తుంది—ఏమిటీ కాలప్రభావం ?

*　　　*　　　*　　　*

పగలు పగలల్లా కష్టపడిన ప్రతిఅణువు నిదురలో విశ్రాంతి తీసుకుంటూఉంది కళకళలాడే ఈ ప్రపంచం ఎంతనిశ్శబ్దంగా ఉంది— అర్ధరాత్రిఅయినా ఈవినీలాకాశం ఎంత అందంగాఉంది—

నిజంగా పగలుకంటే, రాత్రేభావపరిణతికి బాగాఉంటుందను కుంటాను. నా కిటికీ సందులోంచి నన్నుచూచి నవ్వుకొనే నక్షత్రాలు ఎంత మిలమిలా మెరిసిపోతున్నాయి ఒక్కొక్క నక్షత్రం ఎన్నెన్ని రంగులతో ప్రకాశిస్తూఉంది.

ఈఅర్ధరాత్రివేళ ఒక ఆకురాలినా, పూరేకుజారినా పక్షి అరచినా, ప్రకృతి హృదయం జల్లుమంటుంది, శాంతి విచ్ఛిన్నమైపోతుంది. శృతివిభిన్నమైన వీణానాదంలాగ, హృదయం జలదరించి పోతుంది. ఆహృదయవేదన రసగ్రహణ పారీణులకుతప్ప అందరికీ తెలియదు లెండి.

చిత్రకారుడు చిత్రాన్ని చిత్రిస్తాడు. తనజీవితం అంతా చిత్రానికి ధారపోస్తాడు. చిత్రానికి జీవప్రతిష్ఠచేస్తాడు. చిత్రం అయిపోగానే లేకలేక పుట్టిన పుత్రసంతానాన్నిచూచి ఆనందించే తండ్రిలాగ ఆనందం అనుభవిస్తాడు. అతని బ్రహ్మానందం అంతా భగ్నం చేయాలంటే, అబొమ్మ నల్లని కనుగుడ్డులో కందిగింజంత తెల్లబొట్టుపెడితే చాలదూ! ఆకళా స్వరూపం ఏమౌతుంది...? కానివ్వండి ఆ చిత్రకారునికే తెలుస్తుందిగాని, అందరికీ తెలియునుకదూ మరి—

లలిత కళాప్రియునకు ఈరసమయజగత్తులో, ప్రత్యణువు పరమానందాన్ని ఇస్తుంది. ప్రత్యణుపులకిత వసుంధరా తలముమీద ప్రణమోపాసనచేసే, ఆనందమూర్తి—ఆకళామయుడే.

కవి కావ్యాన్ని చిత్రిస్తాడు, కావ్యజగత్తులోని పాత్రలనుమాటలతో ప్రాణంపోస్తాడు. ఆ ప్రాణులను రంగులతో ప్రాణం పోస్తాడు చిత్రకారుడు ఆ పాత్రల దర్శన—ప్రదర్శనాలచేత సజీవులను జేస్తాడు నటకుడు.

ఈ కవికి, చిత్రకారునకు, నటకునకు, విడువడని అవినాభావ సంబంధంఎన్ని జన్మలనుంచో వస్తుంది వారిననుసరించి లోకం నడవవలసిందేకాని, లోకాన్ని అనుసరించి వారునడవరు—లోకాన్ని వారు గడ్డిపోచకింద చూస్తారు—వారిపిచ్చివారిది. వారిపిచ్చికివారే ముందు వేసుకుంటారు—వారి ఆనందంవారిది, వారిఆనంద జగత్తులో సృజించుకొన్న పాత్రలనుచూచి వారే పరవశం పొందుతారు.

వారే సర్వస్వాతంత్ర్య సామ్రాజ్య చక్రవర్తులు. అసలు న్యాయతా స్వతంత్రజీవులు సంఘం చేతిలో ఎన్నడూ కీలుబొమ్మలు కాలేరు, సంఘరథాన్ని నడిపే స్వార్థపరులను వారు అస్పృశ్యులుగా చూస్తారు— కళాభిమానియైన అస్పృశ్యుని సహితం వాళ్ళు ఆదరిస్తారు.

నేను అర్ధరాత్రివేళ కిటికీ సందులోనుంచి ఆకాశాన్ని చూస్తూ ఆనందిస్తున్నాను. ఆనందం అరక్షణంకంటే అట్టేకాలం ఉండదుకదా! అందుచేత అపుడే నా మేడమీదగది తలుపు చప్పుడయింది.

ఎవరా అది అని తలుపువంక చూచాను.

ఇంకెవరు మాఅమ్మే.

మందివ్వటానికి ఆ అర్ధరాత్రివేళ వచ్చింది. గ్లాసులో వేసుకొని తీసుకుంటున్నానమ్మా అని ఆమెను పంపించి, నా మంచంక్రింద ఉన్న బాల్చీలో ఆ కాస్తమందూ పారపోసేశాను

లేకపోతే తాగుతానా?

నాజబ్బు నాకు తెలీదూ? మందులువేస్తే పోయేజబ్బేనా నాజబ్బు ఎందుకో—ఈమందులూ మాకులు. ప్రాణంపోయేవంతు ఈనాలుక విషాన్ని చవిచూచినట్లు, ఈమాయదారి మందులను చవిచూడవలసిందేనా? హృదయాపరివర్తనం తెలుసుకోలేని ఈడాక్టర్లంతా ఎందుకు? దెబ్బ ఒకచోటుంటే మందొకచోటవేసే ధీమంతులుకదూ వీరంతాను.

నాచెవులకు గంటల శబ్దం వినబడింది.

నాకన్ను లనుకోకుండా గడియారంవైపు చూశాయి.

అబ్బా! అప్పుడే ఎంతటయిమయిపోయింది.

రెండుగంటలయిందా! తెల్లవారటానికి ఇంకా మూడుగంటలుందా? మళ్ళీపగలు—తరువాతరాత్రి ఇలా ఎన్ని రాత్రింబగళ్ళు గడపాలో ఈజీవితం అంతరించటానికి——

అయ్యో భగవంతుడా! చక్కని స్వరూపం ఇచ్చావు. స్వరూపానికి తగిన విద్యనిచ్చావు. విద్యకు తగిన వివేకాన్ని—వివేకానికి తగిన

వినయాన్నీ ఇచ్చావు. ప్రయోజనమేముంది? నా అందచందాలు ఎవ రికి ఆనందాన్ని శాశ్వతం ఇచ్చాయి. నాఐశ్వర్యం ఏవిధంగా ప్రయో జనకారి అయింది.

అడవిలో ఎన్ని సుకుమార సుందరతరమైన పుష్పాలురాలిపో తున్నాయో? వాటిపరిమళం ఎవరు ఆఘ్రాణిస్తున్నారు?

సముద్రగర్భంలో ఎన్నివేల రత్నాలు తళతళా మెరిసిపోతు న్నాయో! వాటిసౌందర్యాన్ని ఎవరు అనందిస్తున్నారు?

ఎన్నిలతాని కుంజములలో వికసించిన పూల, స్రవించిన, తేనెలు నేలపాలై పోతున్నాయో! వాటి మధురిమను ఏ తుమ్మెద ఆస్వాదిస్తుంది?

మబ్బుమాటున ఎన్ని నక్షత్రాలు మణిగిపోతున్నాయో! వాటి రామణీయకానికి ఎంతమంది ముగ్ధులౌతున్నా?

ఏమిటో!

ఈ సృష్టిలో మానవుని దృష్టి నాకర్షించకుండా ఎన్నోవస్తు వులు మటుమాయమై పోతున్నాయి—వాటి గురించి ఎవరు విచారి స్తున్నారు? ఎందుకు విచారిస్తారు!

వాటికంటే నా జీవితం ఉత్తమోత్తమమైనదా? వాటిలాగే నా జీవితం నిష్ప్రయోజనమై పోతుంది......వాటిలాగే నా జీవితం కూడా కాలగర్భంలో కలసిపోతుంది. మంచిది—కలసిపోనియి—

* * * *

ఎవరది ?

సత్యం—సత్యం.

నీవేనా ?

అబ్బా ! ఎంత కాలనికి వచ్చావు ? రా ! సత్యం ! రా !

అలాచూస్తూ నిలబడతావేం ?

నేను నీదాసనేకదా ! సత్యం !

నేను నీ ప్రియురాలనేకదు అలానిలబడతావే సత్యం !

రావూ ! రావూ ! వచ్చి నా పక్కనుకూర్చోవు—

ఆ...ఆ...ఎవరు ? ఎవరూలేరూ ?

కలా ! భ్రమా !.........

నా కన్నులు నేను రెండు చేతులతో నులుపుకున్నాను ఎదుట ఎవ్వరూలేరు ? ఎందుకుంటారు ? ఎవరొస్తారు ?

నా పాపపు బ్రతుకుపైన అమృత వర్షం ఎలాకురుస్తుంది. నా జీవితాన్ని నాశనం జేసేవారు వస్తే వస్తారేమోకాని, నా అనురాగ వల్లరిని ఆశాపుష్పాలచే అలంకారం జేసేవారెవరు వస్తారు ?

అందులోనూ నా ప్రణయాధి నాయకుడు నా సత్యం వస్తాడా ? ఎంతమాట.

పోనీ ఒంటివాడు కాబట్టి ఏదోవంకపెట్టి పిలిపిస్తానా ? సంవత్సరం క్రిందవరకు ఇంటివాడే—సంవత్సరం క్రిందవరకు నేను గీచిన గీటును దాటనివాడే—నాప్రణయ వీణను అరగోట మీటినవాడే. నా కనుల ఆనంద జ్యోతి వెలిగించినవాడే నా హృదయ నందనోద్యాన వనంలో ప్రేమమకరంద మాజు మందారముల వికసింప జేసినవాడే—

ఇప్పుడో—

ఒకయింటి వాడయ్యాడు. ఒక స్త్రీ కనుసన్నల మెలగవలసిన వాడయ్యాడు.

బానిసకు—అతనికి భేదమిప్పుడేముంది?

తన యిష్టం వచ్చినట్లు తాను ప్రవర్తింప వచ్చునా?

తన యిష్టము వచ్చినచోట్ల తాను ఉండవచ్చునా?

ఉంటే తన ప్రియురాలు ఇంట్లోనంటరిదై పోదూ!

అయినా—

ఇది అతని తప్పా? ఎన్నటికీ కాదు.

నేనేకదా అతనిని వివాహం చేసుకోమని బలవంతం జేసింది ఒక రోజున నేను—సత్యం! నీకు నాయందు పవిత్రప్రేమ ఉంటే—నాకు ఆనందం కలిగించటం నీకు ఇష్టమైతే—నీవు మీ వారికి ఇష్టమైన అమ్మాయిని జేసుకో...గృహస్థుడవవు 'ప్రజార్థై గృహమేధినా' అనే ధర్మాన్ని సార్థకంచేయి—సత్యం! పిల్లలకంటే తల్లికి కావలసిం దేముంది? 'మాతృదేవి' అని అనిపించుకో గలిగిన మానినీమణి జీవితమే జీవితము. అంతకంటే ధన్యజీవితం ఏముంది? పిల్లలు 'అమ్మా? అమ్మా' అంటూ పిలుస్తూ తప్పటడుగులు వేస్తూవచ్చి రెండుచేతులలో వాలితే వారిని ఎత్తుకొని, లేతతమలపాకులవంటి వారిబుగ్గలను ముద్దుకొంటూ, గులాబీవంటి అరచేతులను కళ్ళకద్దుకొంటూఉంటే, కారే ఆనందా శ్రువులు ఎన్నిజన్మాల పుణ్యం చేసుకుంటే వస్తాయో!

సత్యం! దీపంలేని కొంపలాగ, బిడ్డలు తిరుగని ఇల్లు ఏం లాభం? ఏం ఆనందాన్ని ఇస్తుంది? చూడు సాయంకాలం దీపంపెట్ట

గానే నలుగురు పిల్లలూ లైటుముందుజేరి, గొంతెత్తి చదువుకుంటూ పాడుకుంటూ, కథలు చెప్పుకుంటూ, అల్లరి చేసుకుంటూ, ఎంత ఆనందంగా ఉంటారో! అటువంటి పిల్లలను, ముత్తైదువ ముఖం చూస్తే, జేసుకున్న పాపాలుకూడ పటాపంచలై పోతాయి. అటువంటి బిడ్డలు లేని గొడ్డురాలి ముఖంచూస్తే జేయని పాపాలుకూడా సంభవిస్తాయి.

తెలిసిందా సత్యం :

కాబట్టి నాప్రార్థన అంగీకరించి పెండ్లిజేసుకో పిల్లల్ని కను... నీకు పిల్లలుంటే నాకు పిల్లలున్నట్లుకాదా? నీ పిల్లలలో ఒక పిల్లవాడ్ని నాకు పెంచుకుంటానికి ఈయకూడదా! ఇరువురి ప్రేమకు సాక్షీభూతమైన చిహ్నంగా అతడు పెరుగుతూఉంటే—మనకెంత ఆనందంగా ఉంటుంది? అంతకంటే మనకు కావలసిందేముంది?

ఏం సత్యం మాట్లాడవే—

అంటూఉంటే—నిర్ఘాంతపోయి, నిర్విణ్ణుడై, నిలువుగుడ్లువేసి చూసే సత్యాన్ని పెండ్లిజేసుకోమని బలవంతం జేసాను.

నామాటలకతడు వెఱ్ఱివాడై పోయాడు.

నా రెండుచేతులూ పట్టుకొని దీనస్వరంతో ప్రార్థించాడు.

నళినీ! నీ మీద ఆధారపడిన నా జీవితాన్ని తోసివేయాలనుకుంటం న్యాయంకాదు. ప్రేమ తత్వం తెలిసిన నీవే ఇలా మాట్లాడతావనుకోలేదు. నీయంతటనీవే నన్ను మరొకరిని పెండ్లిజేసుకో మంటావని అనుకోలేదు.

నళినీ! నేను నీకేమి అపరాధం చేశాను నిన్ను మనసార ప్రేమించాను. ప్రేమభిక్ష పెట్టమన్నాను. ప్రేమభిక్ష పెట్టి నావలపుటాకలితీరుతే నే, నీప్రేమధనం తరిగిపోతుందా ?

నళినీ! ఈ విశ్వప్రపంచంలో నాసహాభాగినిగా ప్రేమించింది ఒక్కరినే—నేనీజన్మలో నాభాగ్యదేవతగా చూచింది. ఒక్కరినే—నేనన్నిజన్మాలకై నా ప్రేమించ గలిగింది ఒక్కరినే—అదెవ్వరు దేవీ! ఎవ్వరు ఎవ్వక—అది నీవేకదూ—

ప్రియతమా! అటువంటి నిన్ను విడిచి మరొకరిని ఈ సత్యం ఎలా పెళ్ళిజేసుకుంటాడు చెప్పు.

అయినా—ఈ ప్రపంచకంలో ఒక స్త్రీ ఒక్కడినే భర్తగా ప్రేమించ గలదు. ఒక్కనికే తన ప్రేమ సర్వస్వం ధారపోయుగలదు. ఒక్కనికే తన జీవితంలో రత్నాలను ఏర్చి, మాలగాకూర్చి, ఆప్రియునకు అలంకారం చేయుగలదు. అంతేగాని ఇద్దరిని ఎన్నడూ, ఏయుగం లోనూ, సమంగా ప్రేమించలేదు. పంచభర్తృక అయిన, మహాస్వాభిమతల్లి అయిన ద్రౌపది, తన భర్తృపంచకంలో అర్జునునియందే ప్రేమ యెక్కువ......పక్షపాతబుద్ధి చూపక తప్పదు...

అందుచేత ఒక స్త్రీ ఇరువురను ప్రియులుగా ప్రేమించిన యెడల, వారిరువురినీ నాశనం చేస్తుంది.

వింటున్నావా ?

అలాగే ఒకపురుషుడు తన జీవిత సర్వస్వాన్ని ఒక్క స్త్రీకే యివ్వగలడు. తన జీవితోద్యానవనంలోకి మధుర నిష్యందములైన పుష్పాలనన్నిటినీ కోసి, దండగుచ్చి మంగళప్రదమైన గళానికి అలంకృతం చేస్తాడు. ఆనందడోలికలలో ఊగులాడిస్తాడు—

అంతేగాని ఒక పురుషుడు ఇద్దరి స్త్రీలను, ప్రియురాండ్రగా ప్రేమిం చలేడు. అలా ప్రేమించిననాడు వారిని నాశనంచేస్తాడు. తానూ నాశనం అవుతాడు.

అందుచేత ఒక స్త్రీ ఇద్దరు పురుషులనుగాని, ఒక పురుషుడు ఇద్దరు స్త్రీలనుగానీ, ప్రేమించలేరు.

నళినీ !

ప్రియసీ ! నా జీవితగ్రంథం, చక్కని రసవద్ఘట్టములతో నింపు తున్నాను. ప్రతిపుటా కరుణసంభూయిష్టంగా దిద్దుతున్నాను. ప్రతి పదం మధురాక్షరాలతో కూర్చుతున్నాను. అటువంటి ఉద్గ్రంథం నీదివ్య పాదాలకు అంకితం చేయటానికి నీచెంత నిలబడ్డాను. దీనుడనై మొర పెట్టుకొంటున్నాను, నాజీవితగ్రంథం అంకితముగొనవూ ? నాప్రార్థన పరిపాలించవూ ! నన్ను నీవానినిగా చేసుకొనవూ ?

నళినీ ! నళినీ !

అనురాగామృతపాత్ర, నామధురాధరాని, అందించావు. మన సారా త్రాగబోతున్నాను ఆనందం అనుభవించబోతున్నాను. అటు వంటి నన్ను అమాంతంగా పుటుందుకుతోసి, అనురాగామృతాన్ని నేల పాలుజేసి, నాజీవితాన్ని నాశనంచేస్తే లాభమేముంది !

ఏం నళినీ మాట్లాడవేం ?

నేను నీకు పగవాడనై పోయాను ?......

... ... ... ... ... ...

అంటూ నా రెండుచేతులూ పట్టుకొని తనకనులకు అద్దుకొన్నాడు అతని కనులజారిన నీరు నాఅరచేతులలో—నాకొనవ్రేళ్ళతో—తుడుచు కున్నాడు.

ఆహా ! అతని కన్నీటిచే తడిచిన ఈనాచేతులతోనే ఇప్పుడు నా "భగ్నజీవి" తాన్ని వ్రాసుకుంటున్నాను. ఈకథంతా చదివి మా సత్యం ఎంతబాధపడతాడో !

ఆనాటి మాసత్యం విషాదమూర్తిని తలుచుకుంటూఉంటే—

నాహృదయ కుహరంలో ఇప్పటికే వేయివేల సర్పాలు బుసలు కొడుతున్నట్లున్నాయి. రక్కేనుముండ్ల కంచెమీద నాశరీరాన్ని వేసి, కర్మదేవత లాగుతూఉన్నట్లుంది.

ఏమిటో పాపం? మాసత్యం నన్ను ఎంతగా ప్రేమించేవాడు. మాసత్యాన్ని నేను ఎంతగా ప్రేమించేదానిని, మాయిరువురివలె ప్రేమించుకొన్న ప్రియులీ ప్రపంచకంలో ఎంతమంది ఉంటారో వేలు మడిచి చెప్పండి చూస్తాను

అటువంటి మా ఇరువురకు వైవాహిక సంబంధంచే, మా ఇరువురి బాంధవ్యం పవిత్రంచేస్తే, ఎంత మధురజీవితాన్ని అనుభవించేవాళ్ళం ! ఎంత ఆదర్శప్రాయమైన జీవితాన్ని లోకానికి తెలియపరచేవాళ్ళం ! ఎటువంటి పవిత్రమైన సంతానాన్ని భారతదేశానికి ఆభరణంగా ఇచ్చేవాళ్ళం ?

ఇంతకూ నాజీవితం యిలా తుచ్ఛసంఘం చేతిలో విచ్ఛిన్నమైపోవాలనిఉంటే ఎవరేమి చేస్తారు ! ఏమిటో లెండి !



## 3

నాజీవితాన్ని గురించి సింహావలోకనం చేసినా, భగవంతుని గురించి ఊహించినా, హృదయం బండబారిపోతుంది. బ్రతుకు బరువెక్కిపోతుంది. ఇది భగవత్ సృజనకంతకూ సహజమే ననుకొంటాను.

గడచిపోయిన మధురదృశ్యాలను తలచుకున్నా, గడునబోయే ప్రణయ దృశ్యాలను తలచుకున్నా, హృదయం ఆనంద పగనశ్మై వాయువేగాన్ని పరుగెడుతుంది. మబ్బుకన్నెలతో మాటలాడుతుంది. మెరవు కన్నెలతో మేళ్ళమాడుతుంది...'దిగిరాను దిగిరాను. దివినుండిభువికి' అని వైభోగం వెళ్ళబోస్తుంది.

గడిచిపోయిన విషాద దృశ్యాలను తలచుకొన్న, గడవబోయే వియోగ దృశ్యాలను తలచుకొన్న. హృదయం శిథిలమైపోతుంది. పాతాళ కుహారంలోకి క్రుంగిపోతుంది. తెగిపోయిన గాలిపడగ లాగ, నిరాలంబం అయిపోతుంది. మృత్యుకరాళ దంష్ట్రికలమధ్య చిక్కుకొని, పెనగులాడే, ప్రాణిలాగ, పరితపించిపోతుంది.

ఏమిటో ఈసుఖదుఃఖముల కలియుక !

ఏమిటో ఈ స్త్రీ పురుషుల వాంఛలు !

కలగాదోచే పెండ్లిపందిట ఈ

కలిమిలేములపై కాంతులేమిటో...

ఏమిటో ! ఈవింత సృష్టియొక్క పరిణామం...

ఇంతకూ భగవన్నాటకమే ఒక విచిత్రనాటక మలునపుడు, ఆనాటకంలోని పాత్రలు విచిత్రంగా ఉండవూ...

సూక్ష్మంగా ఆలోచిస్తే—

ఈసృష్టే ఒక విచిత్రనాటకం—

దానిలో ప్రతిప్రాణి జీవితం ఒక విచిత్రమైన అంతర్నాటకం.

కొందరి జీవితాలు విషాదాంతంగాను,

కొందరి జీవితాలు సుఖాంతంగాను, ముగిస్తాయి—

అప్పుడే సృష్టిలో రామణీయకత...

అందుచేతే ఈసృష్టి—మానవజీవితంలాగ—కష్టసుఖ సమిశ్రితం అన్నారు—ప్రాజ్ఞులు...

పామరుల కీవిషయాలేమీ అవగాహనం కావులెండి!

సృష్టిపరిణామాన్ని ఆలోచించి ఆనందించవలసిన వాడొక్క ప్రాజ్ఞుడేకాని పామరుడుకాదు...

ప్రాజ్ఞునకే మానవహృదయ నిగూఢ భావనలు తెలుస్తాయి—తెలిసిందా అండీ!

*　　*　　*　　*

మన జీవితాల్లో ఎన్నో విచిత్రసంఘటనాలు జరుగుతాయి. అన్నీ జ్ఞాపకముంచుకోలేము. అన్నీ మరచిపోలేము. కొన్ని జ్ఞాపకముంటాయి. కొన్ని మరచిపోతాము. కాని కొన్ని మరచిపోవాలన్నా మరచిపోలేము.

నన్ను, నాసర్వస్వాన్ని, నాప్రపంచకాన్ని మరచిపోగలుగుతున్నాను...కాని నానర్మ్యాన్ని నేను మరచిపోలేపోతున్నాను. నాలో నేనెన్నోసార్లు, 'ఛా—ఛా—' సత్యంపైన ఎందుకొచ్చిన వ్యామోహమిది

ఇటు తల్లిదండ్రులకు, అన్నా దమ్ములకు, అక్కచెల్లెండ్రకు—అటు యౌవనవృంధుకోటికి కంటిలో నలుసునై, కులట ననిపించుకొని, వేలెత్తి చూపించుకొని, వ్యర్థజీవిత నైపోయేదానికంటే, సత్యాన్నెందుకు మరచిపోరాదు...అని ఎన్నోసార్లు తర్కించుకొనే దానిని...

ప్రయోజన మేముంది ?

అతనిని మరచిపోవా లనుకొన్నకొలది, అతనిపై మమకారం వృద్ధిపొందుతూ వచ్చింది.

ఎలాగైనా నా మనసును ఆ కాముకలోకమునుంచి మరపించు కుందామని, కవిత్వం నేర్చుకున్నాను. పద్యాలు ప్రారంభించాను. పాటలు వ్రాశాను. ఎవరిమీద ? ఈ సృష్టిమీదనుకున్నారా ? అలా గైతే శాంతేవచ్చేది—కాని నా సత్యంమీద విరహగీతికలు వ్రాసే దానిని—నేను వ్రాసిన గీతికలు నేనే పాడుకొనే దానిని—

దానితో దూరంగాఉన్న సత్యం నాతో ఆడుతూ, పాడుతూ, ఉన్నట్లయ్యేది.

ఇంక అదీకాదని చిత్రకళ నేర్చుకున్నాను. చిత్రించే చిత్రా లన్నీ ఎటువంటివి—మేనకను విడిచిపెట్టి వెళ్ళే విశ్వామిత్రుని ప్రణయ భిక్షపెట్టమని ప్రార్థించేచిత్రం, శివునిప్రేమ సంపాదింపవలెనని పార్వతి ప్రసవ మంజరులను, భావిభర్త పదపద్మములపై గుమ్మరిస్తూ ఉంటే, శ్రవోవతంసమగు సంపెంగిమొగ్గ ఒకింత జారుతూ ఉండగా, పూజ చేయు పార్వతి చిత్రం—ఇంకా సుభద్రార్జునుల చిత్రం; సత్యా కృష్ణుల ప్రణయ కలహ చిత్రం; ఇటువంటి ప్రేమోన్మాదము లైన చిత్రాలనెన్నో చిత్రించాను.

దానితో సత్యం నాపక్కన నిలబడి నా కురులను దువ్వు చున్నట్లు, నాతో పరిహాసం ఆడుచున్నట్లు, మాట్లాడుచున్నట్లు, నవ్వు చున్నట్లు......ఎన్నో విధాలకనబడేవాడు.

నాకు వెఱ్ఱెత్తిపోయేది

నాశారీరంలో ప్రతిరక్తనాళం తీవ్రంగాస్రవించేది—ఆ ఆనంద దృశ్యాలను అరమోడ్పుకన్నులతో చూస్తూ భావిస్తూ, ప్రపంచకాన్ని మరచి పోయేదానిని...అలా కొంతకాలం...

* * * *

అది శరత్కాలం—

అరోజు పౌర్ణమి—

ఆరోజున జరిగిన సంగతి—జ్ఞాపకశక్తినిస్తే వచ్చేజన్మలో కూడా మరువలేను ఆ ఒక్క ప్రణయ దృశ్యమే నన్ను నేటివరకూ సజీవురాలుగా జేసింది. లేకపోతే ఈ పాటికి భూమిలో బూడిదై పోయే దాననే...

ఆ రోజున శారద చంద్రికలు మా పెరట్లో కొబ్బరి ఆకుల మీద మిలమిలా మెరుస్తుంటే—పచ్చగడ్డిపైన గోధుమతాపములు పరువు లెదుతున్నట్లుంది. మల్లెపూల అంచులమీద—మాలతీ హృద యంమీద—అలముకొన్న స్వచ్ఛచద్రికలు—నా హృదయపు ప్రతి అంచుమీదా ప్రణయ సందేశాన్ని రచించు చున్నాయి.

మా పై మేడమీదకు వెళ్ళి నిలబడి నాలుగు మూలలా కలయ జూచాను...అబ్బా! పిండి అరబోసినట్లు వెన్నెల ఎంత దట్టంగా ఎంత ముదురుగాఉంది. మామేడ నిండా తెల్లసిల్కు దుప్పటి పరచి నట్లు...కనుల పండువగాఉంది.

పది నిముషాలు ఆమేడమీాదే వెన్నెలను చూస్తూ, మబ్బుల పరుగులను పరికిస్తూ, ఆనందాన్ని అనుభవిస్తూఉన్నాను, పడకకుర్చీ మేడమీాదనున్న స్తంభం దగ్గరకు ఈడ్చుకొని ఆకాశాన్ని చూస్తూ కూర్చున్నాను.

మరోపది నిముషాలు గడిచాయి. నా భావప్రపంచంలో సత్యం పాటలు పాడుకుంటూ వస్తూ ఉన్నట్లుంది—

మనసంతా సత్యంమీాద లగ్నం అయిపోయింది. సత్యం మా యింట్లోనేఉండి చదువుకుంటున్నాడు—ఇప్పుడు సత్యంవస్తే ఎంతో బాగుండు ననుకున్నాను.

ఈ వెన్నెలలో మేబ్బుల అందాలు చూస్తూ, పూవుల పరిమళం అనుభవిస్తూ, మా సత్యంతో మనసిచ్చి మాటాడుతూఉంటే ఎంత బాగుంటుంది. ఈ చల్లగాలికి కదిలే నా ముంగురులను చూస్తూఉంటే మా సత్యం ఎంత ఆనంద పడతాడు.

అని ఎన్నో ఎన్నో విధాల ఆలోచిస్తూ ఉన్నాను.

అంతలో నాకు తెలియకుండా మా సత్యం ఎప్పుడు వచ్చాడో ఏమో నాకుర్చీ వెనకాలే నిలబడి, నా రెండు కన్నులను పద్మాల వంటి అతని ఎఱ్ఱనిచేతులతో మూశాడు.

అత డెవరు ? అని ఖంగా రెండుకు పడతాను.

మాసత్యం తప్ప నన్ను మాట్లుకొని, నా కన్నులు మూసే మగ వాడీ ప్రపంచకంలో మరొక డున్నాడా ?

ఎఱ్ఱని మా సత్యం రెండుచేతులూ నా చేతులతో పట్టుకొని— అబ్బా ! ఎంతసేపటికి వచ్చావు సత్యం ! అని నా కన్నులకు అద్దుకొ

న్నాను—అతను నా చేతులను పట్టుకొని కుర్చీలోనుంచి లేవదీశాడు. ఇరువురం ఆ ప్రకృతి రామణీయకాన్ని చూస్తూ, పరవశులమయ్యాం.

నిజానికి నిర్మల మనసుతో చూస్తే, ప్రకృతికంటే ఆనందాన్నిచ్చేదేముంది ?

మేమిద్దరం ఎంత ఆనందంగా మాట్లాడుకున్నామో—వర్ణించలేను—పోనీ జ్ఞాపకమున్నంత మట్టుకు కొన్నిమాటలన్నా వ్రాద్దామంటే—ఎందుకో నాకలం వెనుకంజవేస్తూ ఉన్నది. నా భావాలు తడబడుతున్నాయి. నా మనసుకు శక్తి చాలటంలేదు.

* * * *

అలా మేమిద్దరం ఆమేడమీద ఉన్నాకాలం చెబితే మాఆనందాన్ని కొంతవరకైనా మీరు ఊహించవచ్చు.

చెప్పనా ?

రాత్రి 1 గంట అయింది.

ప్రపంచం అంతా నిశ్శబ్దంలో మునిగిపోయింది.

క్రింద మానాన్నా అమ్మా మొదలైన వాళ్ళంతా మేమిద్దరం చదువుకుంటున్నామనుకొని, గురక నిద్రలో మునిగి పోయారు.

మొట్టమొదట మా యిద్దరకూ అపరిమితమైన స్వాతంత్ర్యం ఇచ్చింది మా తల్లిదండ్రులే...మా నైతిక జీవితం గంగపాలైన తరువాత, మమ్ములను వేరుచేయటానికి ప్రయత్నించిందీవారే—చూడండి ఏం ధర్మంగా ఉందో !

కాలం గడచిపోయింది.

మైమరచిన ఆనందంలో మేము మునిగి పోయాము—

ఆ వెన్నెలలో నేను వెండిపళ్ళెంలో ఉన్న మల్లెపూలను దండగ్రుచ్చాను...మా సత్యానికి నా భావం అర్థంకాలేదు,

రాత్రి 2 గంటలయింది.

మా ప్రేమకవి జయనాదాల్లాగున్నాయి.

సత్యంవంక జాలిగా—ప్రేమగా—చూచాను.

సత్యం నావంక చూచాడు.

ఏం నళినీ! అలా అర్థనిమీలితలోచనాలతో అతి జాలిగా చూస్తున్నావని ప్రశ్నించాడు...

ఆ ప్రశ్నకు జవాబుగా నవ్వుతూ అతని మెడలో నా పూల మాలవేశాను. అతడానందంతో స్వీకరించి ఆ మాలనే నామెళ్లో వేశాడు. ఆ నాటి మా యిరువురి భావాలు భాషకందవు—

నళినీ! ఇందుకా ఈ ప్రయత్నమంతా నేటినుంచి మన ఇద్దరి వివాహం అయినట్లేకదా! అని నన్నడిగితే—ఎంతో గర్వంగా—ఇంకా సంశయమా—అన్నాను.

మేమిద్దరం ఆనాడే మా వివాహం అయిపోయిందనుకున్నాము. అటువంటి గాంధర్వ వివాహాలెన్నో ఉన్నాయని సంతోషించాము— శకుంతలా దుష్యంతుల వివాహానికి మా వివాహం ఏ విధంగానూ తీసిపోదనుకున్నాము—

అలా కర్మసాక్షి యెదుట—భగవత్సాక్షిగా మావివాహం అయిపోయింది. లోకానికి తెలీదు...

కాని...లోకం నాబాల్యదశలో నాకుచేసిన వివాహం నాకు తెలీదు. నామంగళసూత్రం నాకు జ్ఞాపకం లేకుండానే తెంపివేసిన

సంగతీ నాకు తెలీదు...కాని పసుపుకుంకుమకు, పూలసరాలకు దూరమైన సంగతి నాకు కాలం గడుస్తున్నకొలదీ తెలుస్తూ వచ్చింది.

నా మంగళసూత్రం పుటుక్కున తెంపినందుకు నాకేమత్రంకూడా విచారంలేదు. కారణం అవన్నీ నా కసలు జ్ఞాపకమేలేదు చెబుతే వినటమేగాని—ఆ బొమ్మలపెళ్ళి నాకెలా తెలుస్తుంది...?

పసుపుకుంకుమకు నేటివరకు నన్ను దూరంచేశారు. నాతోటి వాళ్ళంతా కాలేజీకి పూలుపెట్టుకు వస్తుంటే...నాకు పాత్రిలేకపోయినందుకు...నాలో నేనెన్నికన్నీళ్ళు కార్చానో ఈగుడ్డిలోకానికి ఎలా తెలుస్తుంది ?

నేనూ అందరి స్త్రీలలాగా పుట్టాను. నాకూ అందచందాల యందు ఆస ఉంటుంది...నాకూ వారిలాగ పసుపు కుంకుమలయందు, పూలనోములయందు, కోరికలుంటాయి...అందరితోటి సమభాగినినై బ్రతుకవలెనని నాకూ ఉంటుంది...

తోటి కన్నెపిల్లలంతా, తమభర్తల మన్ననల పొందుతూ ఉంటే, నాకుమాత్రం ఆ ఆనందం అనుభవించుదామని ఉండదూ ? భర్తలుకలిగి—కాలం మరలిన భార్యలే తమ కామతృష్ణను చంపుకోలేక పరపురుషులను కాంక్షిస్తారే...అటువంటప్పుడు పరపురుషుని కరస్పర్శనైనా ఎరుగని నేను సత్యాన్ని భర్తగా కోరటంతప్పా...భ్రూణహత్యలెన్నైనా చేయవచ్చునుగాని, తన ఇష్టమువచ్చిన భర్తను చేనుకొని, జీవితాన్ని మంగళప్రదం చేసుకోకూడదు కాబోలు...

ఏమిటో ఈవెఱ్ఱిఛాందసుల శాస్త్రిలకు అర్థంలేదు. ఆయా కాలాల ననుసరించి ఆయా సంఘ నిబంధనలు, సూత్రాలు, వ్యాఖ్యలు,

ఏర్పడ్డాయన్న సంగతి తెలిసీ ఈమూర్ఖలోకం న్యాయ పరిపాలనలో ఉండదే...

అయినా మావంటి భగ్నజీవులెంతమందో నాశనమౌతున్నా, కనిపెంచిన తల్లితండ్రులైనా న్యాయమార్గావలంబికులు కారే...మా కన్నీరుకూడా వారి రాతిహృదయాన్ని కరిగింపదే...

వాళ్ళుమాత్రం ఏంచేస్తారులెండి...తోలుబొమ్మ ఎలా తిప్పితే అలా తిరిగినట్లు, సంఘం ఎలాతిప్పితే అలా తిరుగుతారు...వీళ్ళకొక నీతా—జాతా...మానాభిమానాలా ? ఏమీలేవుగా...

సరే వీళ్ళసంగతి తరువాత చెబుతాను, కాని ఆనాటిముచ్చట్లు కొంచం చెప్పనియ్యండి.

* * * *

మాసత్యం వేసినపూలదండ తాకిననామెడ, మరచిపోయిన పూర్వజన్మ సౌభాగ్యాన్ని తలచుకొన్నట్లయింది... అప్పటి నాముఖ కాంతినిచూచి మాసత్యం ముగ్ధుడైపోయాడు.

నళినీ! ఆమల్లెపూలదండనే తలలో ఎందుకు పెట్టుకోకూడదూ! అని అనకుండా ఉండలేపోయాడు నామాటకు జవదాటలేని అతని కోరిక నెరవేర్చలేకుండా ఉండలేపోయాను...

సత్యం! అలాగే నాతలలో నీవేపెట్టు—అంటుంటే సత్యం పెట్టటం—వాడిపోయిన నాపలపు తీవ మరల పుష్ప వికసితమైనట్లుండటం—సంభవించాయి...

నాఉత్సాహాన్ని, ఉద్రేకాన్ని, చెప్పలేను—

నస్యం ఇప్పుడే వస్తానండు అనిలేచి, లేడిలా నాలుగుగంతులలో మేడక్రిందభాగం హాలులోకి వెళ్లాను. తగ్గిచిఉన్న అరికెనలైటు పెద్దదిగా జేశాను...

నిలువుటద్దములో గర్వగా, నవ్వుతూ, నాముఖాన్ని చూచుకున్నాను...అబ్బా! ఎంత అదంగాడున్నాను. నాపేృమదేవత చిరునవ్వుముత్యాల జల్లులాగ, నావేశభరంలో మల్లెపూలమాల, క్రొండళ్ళకుల వెదజల్లుతూఉంది

నాభర్త చనిపోయిన తరువాత తలలో పూలుపెట్టుకుంటుం అదే మొదటిసారి. నాసౌభాగ్యలక్ష్మికి నాయందు అనుగ్రహం కలగటానికి అదే తొలినాడు...అదే తుదినాడు...నాజీవితంయొక్క పరిపూర్ణానందానికి అదే తొలినాడు...అదే తుదినాడు...

పూలమాలాలంకృతములచే పునీతమైన నా ఆవినీలాలకల సౌందర్యమును, ఎన్నిసార్లు నిలుటద్దంలో చూచుకున్నానో చెప్పలేను. ఎన్నిసార్లో తెలిగన్నుల వలపువెన్నెల కాయించాను. క్రీగంట నవ్వుకున్నాను...ముఖానికి పౌడరద్దుకున్నాను...

ఎన్నో చేశాను...

కాని ఏవో లోపించినట్లు నాముఖం కళావిహీనమైనది. ఏమిటా అని ఆలోజించాను...అటూ ఇటూ పరికించాను. అద్దంక్రింద టేబిలుమీద ఆ వస్తువు కనబడింది——

ఏమిటది.

ముత్తయిదువులకు ముంగొండ బంగారము.

అదే 'కుంకుమభరిణి'

అదే భారతదేవి ఫాలభాగమునకు అలంకార భూషణము.

నా హృదయం జల్లుమంది...

అమ్మో! అంతపనేనా!

నా మనసు నాలుగు నిముషాలవరకు నాస్వాధీనంలేదు నా ఆత్మ కునేను మళ్ళీ ధైర్యం తెచ్చుకున్నాను...

నేను చేసేబానిలో ఏవిధమైనతప్పూ లేదనుకున్నాను... అక్కడనుంచి నెమ్మదిగా మేడమెట్లదగ్గరకువెళ్ళి నామూతిదగ్గర రెండు అరచేతులూ దొప్పగాచేసి, నామాట ఇతరులకు వినబడకుండా, నెమ్మదిగా, సత్యం, సత్యం, అని పిలిచాను.

నాకోసం ఎదురుత్రోవలు చూస్తూఉన్న సత్యం నామాట వినీ వినడంతోనే పిల్లడుగులు వేసుకుంటూవచ్చి నాచేయిపట్టుకొని—ఏం నళినీ! అని ఎంతో ఆప్యాయంగా అడిగాడు...ఆక్షణంలో అతని ముఖంలోఉన్న భావశాబల్యం నాకిప్పటికీ కన్నులకు కట్టినట్లుంది... ఎలా మరచిపోతాను...అటువంటి మధురదృశ్యా లెవ్వరూ మరచిపోలేరు—

ఇలానా సత్యం అని హాలులోకి తీసుకువెళ్ళి ఆవుంగళ వద్దమైన 'కుంకుమభరిణిని' చూపించాను. అతడు గ్రహించి...నళినీ! ఈ కొరతకూడా తీర్చివేద్దాం...అని అతని చేతులతో నానొసట తిలకము పెట్టాడు. నన్ను పుణ్యాంగనను జేశాడు...నాప్రతి రక్తాణువు అర్ధాంగి జీవితంలో ఐక్యమైపోయింది...

ఆనాటి నాముఖం ఏనాటికీ మరచిపోలేను—

ఆ నొసటి కుంకుమ—ఆతలమీద పూలు—

పాడుపడిన దేవాలయంలో—విగ్రహాన్ని పునఃప్రతిష్ఠితం చేసినట్లుంది.

మేమిద్దరం మా ముఖాలను అద్దంలో చూచుకున్నాము.

చంద్రుడు—చంద్రికలులాగ ప్రకాశించాము.

మేమిద్దరం మేడమీదకు వెళ్ళాము.

వెన్నెలలో చేయి చేయి కీలించి తిరిగాము. మాజీవితాలగురించి మేమెన్నోవిధాల ఆలోచించుకున్నాము.

ప్రపంచకం తల్లక్రిందైనా ఇద్దరం వివాహం చేసేసుకుందామనుకున్నాము.

కాబోయే భార్యాభర్తలంకదా అని ఒకరి నొకరం చూచుకొని నవ్వుకున్నాము.

కాని మా మనసులలో మా అమ్మా నాన్నా వాళ్లు ఒప్పుకుంటారో లేదో అనేభయం లేకపోలేదు.

అలా ఎంతసేపు మాట్లాడుకుంటాము,

ఎవరన్నా లేస్తే అట్టే బాగోదు కదు మరి.

అందుచేత ఎవరిగదిలోకి వాళ్ళుపోయి పండుకున్నాము. ఆరోజున నాతలుపులువేసి నాతలలో పూలతోనే పండుకున్నాను. ఆపూల సువాసన లెంతబాగున్నాయి. నాజీవితాన్ని నందనోద్యానవనంలోకి మోసుకుపోయాయి-—

చూశారా! అంతచక్కనిరోజు నెలా మరచిపోతాను.

ఆ రాత్రంతా తీయని కలలు.

మధ్యమధ్య సత్యం—సత్యం—అని కలువరింతలు. అటువంటి జీవి తాన్నేగనక నాకు ప్రసాదిస్తె స్వర్గసుఖంకూడా అభిలషించను.

అలా ఆనందాన్ని కూరుస్తే భగవంతునిలో గొప్పేముంది. కొందరు కన్నీళ్ళు కారుస్తేనేకాని, ఆయన సింహాసనం బూజుకడగబడదు. ఏమిటో సృష్టి విచిత్రం ఈదృష్టికందదు.



## 4

తెల్లవారెను—కోడికూసెను,
ఎల్లపనులకు—వేళ ఆయెను,
మే లు కో !
కృ ష్ణా !
మే లు కో !

కృష్ణుడు మేలుకోవాలా ?
ఎంతబాగుంది—?

కృష్ణుడసలు నిదురపోలేకదా మేలుకుంటానికి, ఒక్కసత్యాన్ని తలుచుకుంటుంటేనే రాత్రంతా నిదరపట్టటంలేదే—పదహారువేల గోపికలను తలుచుకుంటున్న కృష్ణుడు నిదురపోగలడా ?

కోడికూసిందా ? అవును, దానికి పనేముంది. ముసలివాళ్ళకు నిద్రపట్టనట్లే దానికీ నిద్దర పట్టదు.

పనులలోకి వెళ్ళాలంట, ఎందుకు వెళ్ళరు ! ఇంక చేసేదేముంది ? సూర్యునితో లేవటం, సూర్యునితో అస్తమించటం, పగలుపగల్లా చేసేపనేముంది. అబద్ధాలాడటం—డబ్బుగడించటం—మావంటి అనాధులను నాశనం చేయటం.

* * * *

గడియారంవంక చూచాను.

అయిదు గంటలయింది.

రాత్రిఒంటరిగా ఎన్నికన్నీళ్ళుకార్చినా కారుచీకటిలో కలసిపోయేవి. కన్నీరు కార్చినకొలదీ హృదయం తేలికయ్యేది. హృదయభారంతగ్గిపోతూఉంటే కొంతశాంతి ననుభవించేదానిని.

కాని రాత్రిబ్రతుకు తెల్లవారిపోయింది.ప్రభాతవాయువులువీస్తూన్నాయి. పగలుపగలంతా ఏమీఎరుగనట్లు, బాధననుభవించి చూపులతో, బ్రతుకు బరువులు వహించాలి కపటజీవయాత్ర నిర్వహించాలి. హృదయ పరిదగ్ధభావనలు ఏడ్వనైనా వీలులేని దుర్భర జీవితం ఇలా ఎంతకాలం గడపాలో తెలియటంలేదు.

కాలవిషసర్పం ఎంతెమందినో కాటేసి ప్రాణాలు తీస్తుంది... నా జోలికి మాత్రం రాదు. నేనంటే ఎంతభయమో ?

అమాయకుల శిరసులపైన పిడుగుల వర్షం కురుస్తుంది. నాతల మీద ఒక్క పిడుగుకూడా పడదు ? అవసరం వచ్చినప్పుడు అటువం టివి జరగవుకదూ !

* * * *

తెల్లవారింది

యధాప్రకారం మందులూ మాటలూ...కాఫీత్యాదులు— డాక్టర్ల ఇంజక్షను...జాలితో నిట్టూర్పులు...స్నేహితుల ఓదార్పులు అమ్మగారి కన్నీళ్ళు—ఇవి నాప్రాణ గండాలు—

అయినా అమ్మతో నేను నా హృదయం స్పష్టంగా చెప్పాను. అమ్మా ! సంఘంతో మనకు పనిలేదు. మనం కష్టపడుతూఉంటే సంఘం ఓదారుస్తుందా ? మనకు తిండిలేకపోతే, సంఘం తిండిపెడుతుందా ? అటువంటి తుచ్ఛసంఘాన్ని లెక్కచేసి మన ఆనందాన్ని, సౌంద ర్యాన్ని, నిష్ప్రయోజనం చేసుకుంటూం ఎందుకు ? అని ఎన్నోవిధాల చెప్పేను. ప్రయోజనమేముంది—

నళినీ ! మళ్ళీ నీకు పెళ్ళిచేస్తే సంఘం మనలను వెలివేయదా ? మన పరువు—పోదా ? పరువు మర్యాదలులేక బ్రతుకగలమూ ?

అంటూ ఉపన్యాసం ప్రారంభించేది దానితో నానోరుకట్టువడేది.

సంఘాన్ని ఎదురించటమంటే నాకు పంచదారనీళ్ళు త్రాగిన ట్లుండేది. కాని నాకు మాఅమ్మా నాన్నలను ఎదురించటం అంటే పంచప్రాణాలు కడంటినట్లుంటాయి. తలప్రాణం తోకకువస్తుంది— ఏంచేస్తాను.

మా సత్యంతో ఎన్నో ప్రమాణాలుచేశాను. ప్రపంచకానికి లెక్కచేయకూడదన్నాను. కానిమాఅమ్మముందు గట్టిగా మాట్లాడ

లేను. ఆమె ముఖం చిన్నబుచ్చుకుంటే నేను చూడలేను. ఆమె కన్నీ రెలా చూడగలను. ?

సత్యాన్ని విడిచి నేను బ్రతకలేనని—సత్యం అంటే నాకువంచ ప్రాణాలనీ మాఅమ్మకు తెలుసు. చెప్పకూడదుగాని, మేమిద్దరము మాతోటలోకి చేతులు చేతులూ కీలించి వెళ్ళటం, మేడమీద నవ్వు కుంటూ పాడుకుంటం. చక్కని టిఫినులు ఇద్దరంకలసి తినటం, డ్రామా లకు సినీమాలకు కలసి ఇద్దరం వెళ్ళటం, ఇంకా ఇంకా ఎన్నోవిధాల ఆనందంగా ఉండటం, ఆమెచెవులారా విన్నది, కన్నారా కాంచిది, నాఆనందాన్ని చూచి తానుకూడా లోలోన ఆనందించింది. మేమిద్దరం ఎక్కడన్నా కూర్చుంటే మాదగ్గరకువచ్చి కూర్చుని, మా మాటల్లో తానూ పాల్గొనేది—నళినీ! మీసత్యాన్ని ఏంగోలచేస్తున్నావే అనేది; దానితో మాయిద్దరకూ మరింత ఉత్సాహం అయ్యేది—

పిల్లల ఆనందంకంటే తల్లులకు కావలసిందేముంది ? తల్లి ఆనం దంకంటే పిల్లలకు కావలసిందేముంది ? ఇలా సత్యం నేనూ వివాహం లోకానికి తెలిసేటట్లు చేసుకోలేపోయాంకాని—భార్యా భర్తలలాగ జీవించామని మీకుచెప్పటానికి నాకేమీ సంశయంలేదు, సిగ్గూ లేదు. ఎందుకు ? ఏంతప్పుపనిచేశానని సిగ్గుపడాలి ?

పతులమాటున పిల్లలను కన్నానా ?

భ్రూణహత్యలు చేశానా ?

ఈకపట నటకులకంటే నేనెన్నోరెట్లు నిర్మల జీవినని నాకు తెలు సును. పతిని అడ్డుగా నిలబెట్టి వారుచేసే మహాకృత్యాలన్నీ లోకానికి కనబడవు. లోకంవారికి అగ్రతాంబూలం ఇస్తుంది, గౌరవిస్తుంది, పూజి స్తుంది—

మావంటి అభాగ్యజీవులను చూస్తే కళ్ళొత్తజేస్తుంది, పళ్ళు పట పటా కొరుకుతుంది—మాకుత్తుకలను ముండ్ల చేతులతో నులిపివేస్తుంది—

ఇంతకూ ఇదిలోకం తప్పుకాదు

లోకానికి లొంగిన బానిసల తప్పు.

*　　*　　*　　*

ఈనాలుగు గోడలమధ్య నేను ఖయిదీని—నాభావాలకు నేను బానిసను, నాసత్యానికి నేనుదాసురాలను—నేనీ నాలుగు గోడలమధ్య నున్న ఖయిదులోనే ప్రాణం విడవాలి, కోరికలు తీరనిమనసుతో కూలిపోవాలి, ఆశలుతీరని హృదయంతో ఆవేదనపడుతున్నాను.

ప్రపంచకానికి ఒకపక్క నాశనం, రెండవపక్క ఉత్తేజం—నేను నాశనం అయిపోతున్న పక్కను నిలబడ్డాను—ఆరెండవకొనకు ఎన్న దూరేరను.

నాచుటూ కన్నీటి సముద్రాలున్నాయి, వాటిమధ్య ఎండిపోయి బీటలువారిన భూమిలాగ, నాజీవితం మొరకువారిపోయింది.

నాహృదయంలో ఎన్నో భూకంపాలు బద్దలైపోతూ ఉన్నాయి.

అయితే ఎవరికేం ?

*　　*　　*　　*

కాలం మారిపోతూఉంది.

మానవ హృదయం మారిపోతూఉంది. నేనూ సత్యం కాలేజీ కోర్సు కలసి చదువుకున్నాం స్నేహితులం బంధువులం...అతడు మా

యింట్లోనే ఉండి చదివాడు...మా తొలిచూపులతో ప్రారంభించిన స్నేహం—జీవితాలు తుదిముట్టేవరకు విడువని దవటానికి కారణం మా యిరువురి అవ్యాజప్రేమ—అధిక స్వాతంత్ర్యమే—విడువని కలియకయే—ఒంటి బాటే—

ఇరువురి భావాలు కలసినవారి చిరపరిచయంలో ఉండే మహత్తర స్నేహం—ప్రేమ—బిగి—గట్టిదనం—మనసులేని భార్యా మంగళ సూత్రపు ముడిలో కూడా ఉండదు.

రోజులు గడుస్తున్నకొలదీ అతడ్నీ నేను నన్నతడూ, విడివిడిఉండ లేపోయాము. అతడు నా పక్కన కూర్చొని భోజనం చేయకపోతే, ఆరోజు నేనూ అర్ధ ఆకలితో లేచేదానిని—

ఈ నా హృదయ పరిణామం అంతా మా అమ్మా నాన్నలకు తెలుసు. కన్నులుండగా గాంచలేదంటామా? కాంచింది గ్రహించలే దనుకుంటామా? వారలాగ చూచీ చూడనట్లు ఊరుకుంటే, మావీధి లోనున్న ఇరుగు పొరుగు వారంతావచ్చి—అలా సత్యంతో మీ అమ్మాయిని సరదాగా అధిక స్వాతంత్ర్యంఇచ్చి మాట్లాడిస్తున్నారే... అంత ఇష్టమైతే వారిద్దరికీ వివాహంచేసి సంఘసంస్కర్తలు కారాదూ. అయినా యౌవనంలోఉండే స్త్రీ పురుషులకు అధిక స్వాతంత్ర్యం హాని కరంకాదూ—అంటూ మా అమ్మా నాన్నలను నాలుగు జాడించి వెళ్లేవారు...వారిద్దరూ మారుమాటాడలేక—కనుల నీరు క్రుక్కుకొనేవారు. వారు మాత్రం ఏం చేస్తారు పాపం!

అటు సంఘం—

ఇటు కన్నకడుపు శోకం—

స్వర్గ నరకాలమధ్య అల్లల్లాడే ప్రాణులులాగ వారు కార్యా కార్యములను తెలుసుకోలేక ! అల్లాడిపోయారు.

నలుగురుముందు తలలెత్తుకొని తిరుగలేపోయారు. జీవచ్ఛవాల లాగ కూలిపోయారు. ఇరుగు పొరుగువారినేమీ అనలేక ఆ కోపం నామీదా, మా సత్యంమీదా చూపించేవారు. మేము మా దురదృష్ట దేవతవంక చూస్తూ కన్నీరునించేవాళ్ళం—రేకలు రేకలూ విడిపోయి రాలిపోతున్న మా ప్రేమపుష్పాలవంక దీనంగా చూచేవాళ్ళం— మావంక మేమే జాలిగా చూచుకొనేవాళ్ళం...

పోనీ అలాగైనా మమ్మల్ని విడిచితే బాగుండేది...మానాన్న సత్యాన్ని పెండ్లిచేసుకోమని, కావాలంటే, పెండ్లికి డబ్బు సాయంచేస్తా నని రోజూ చంపేవాడు...

పెళ్ళి ఎవరిని చేసుకోమన్నాడనుకున్నారు...

అతని ముఖం తెలీని యెవరో 'అబలను'

అతడే సమాధానం చెప్పలేక అలాగే—అలాగే—అంటూ మేడమెట్లెక్కి నావద్దకు వచ్చేసేవాడు...నే నతని వాడిపోయిన ముఖం చూచి కరిగిపోయేదానిని—నెమ్మదిగా అతని కుర్చీదగ్గరకువెళ్ళి నిలబడి, పైటచెంగు అంచులు రెండు చేతులతో నలుపుతూ, ఏం! సత్యం! ఇవాళకూడా నిన్ను పెళ్ళిచేసుకోమని ఉపన్యాసం ప్రారంభించారా— అని అడిగేదానిని...కారే కన్నీరైనా తుడుచుకోకుండా—

అతడు నా వాడిపోయిన ముఖంవంకన్నా చూడలేక, వంచిన తల ఎత్తకుండా, నళినీ ! అనగటమే కాదు...ఇంక ముందు ముందు మీ యింటికికూడా రానీయరు. మనం ఇద్దరం ఇలా ఈ గదిలో ఉన్నా

మంటే, మీ అమ్మానాన్నల మండే కన్నులలో అగ్నిదేవత నిప్పులు చెరుగుతుంటూ ఉంటుంది. గాలి దేవత తన వేయివేల రెక్కలతో నిప్పులను రాజుతూ, మంటను వృద్ధిచేస్తుంది ఏ నాడైనా ఆ మంటలో మనం ఇద్దరం మాడి మసికావలసిందే.

నళినీ! ఇంతకూ మనసా ప్రేమించుకొన్న ప్రియులెప్పుడూ సాధారణంగా పెండ్లిచేసుకోలేరు. అలా పెండ్లిచేసుకుంటే వారిలో ఒకరిని మృత్యుదేవత కబళించివేస్తుంది. రెండవవారు విధురవేదన భరించలేక—వియోగవేదనలచే విశ్వవీధులలో విసువీధిచూస్తూ—చేయెత్తి ఎలెత్తి, తమ తమ ప్రియులను పిలుచుకుంటూ, 'భగ్నజీవు' లై నసిస్తారు. తప్పదు. తప్పదు.

అటువంటి దృశ్యాలే ఈదరిద్రసంఘం—ఈ స్వార్థసంఘం—ఈ గ్రుడ్డిసంఘం—వాంఛిస్తుంది...అంటుంటే అతని కన్నులు సూర్య వికసిత దానిమ్మ పూలలాగ, తళతళా మెరిసిపోయాయి. ధగధగా మండిపోయాయి... కళకళా కనలిపోయాయి...అతని అంగాలు జలదరించిపోయాయి. అతనితో ఏమి మాట్లాడాలో, ఎలా శాంతచిత్తుని చేయాలో, నాకేమీ అర్థంకాలేదు.

అయిదు నిమిషాలవరకు ఇద్దరం ఏమీ మాట్లాడుకోలేపోయాము...తరువాత నేనే నిమ్మదిగా ధైర్యం చేశాను.

సత్యం! సంఘపిశాచం వారిని సగంవరకు కబళించివేసింది... ఇంక నాచావుతో పూర్తిగా కబళించివేస్తుంది...సంఘమంటే ఎవరు? ఏదో దెయ్యమో! భూతమో కాదుకదూ! మనమంతా కలుస్తేనేగా సంఘం...ఈసంఘంలో చదువుకొని అల్పజ్ఞానుల సంఖ్య అధికం.

వారిమాటే నెగ్గాలంటారు. వారుపట్టిన కుందేటికి మూడేకాళ్ళంటారు. వారికితోచదు. ఇతరులు చెపితే నచ్చదు. ఎలకనికట్టి కుందేలంటారు. కాదంటే కాళ్ళు విరగకొడతానంటారు. కళ్ళు పెరికివేస్తానంటారు. పళ్ళు ఊడగొడతానంటారు...తుదకు ప్రాణాలుకూడా తీస్తానంటారు. వారికంటే ముందు వారిబాధపడలేక మనమే ప్రాణాలు తీసుకుంటామనుకో—అప్పటికైనా వారిబుద్ధి మరల్చుకోరుకదా! సూర్యచంద్రాదులను పంటితో. నొక్కిపట్టిన, రాహుకేతువులైనా వారిపట్టు విడుస్తారే కాని, వీరుపట్టు విడువరే...

నిజానికి—ఈమూర్ఖసంఘం చేతిలో కీలుబొమ్మలై, నిర్మలానందాన్ని అనుభవించలేక, ఎంతరి ప్రాణవాయువులు నిరర్థకంగా పంచభూతాల్లో కలిసిపోయాయో చెప్పలేం...ఎంతమంది చస్తేమాత్రం ఏంప్రయోజనం...అంటూ సంఘంమీద కళ్ళెఱ్ఱజేసి దీర్ఘోపన్యాసం ప్రారంభించాను...

దానితో మా సత్యానికి నవ్వువచ్చింది. నళినీ! కన్న తల్లిదండ్రుల నిద్దరిని ఒప్పించలేవే, కనబడని సంఘంమీద కళ్ళెఱ్ఱజేస్తే ప్రయోజన మేముంది? కర్మంమీద కాలుచాస్తే ఎంతప్రయోజనమో అంత ప్రయోజనం...కాబట్టి ఇద్దరిని ఒప్పించలేని మనం సంఘాన్ని ఎలా ఒప్పించగలం చెప్పు...ఏమంటావు...? అంటూ నన్ను హేళన చేసిన అతని రెండుకన్నులు—నాహృదయంలో రెండు బాణాలలాగు నాటిపోయే ఉన్నాయి.

తప్పంతా నాదేనని, మాతల్లిదండ్రులను ఎలాగైనా ఒప్పిస్తాననీ

సత్యంతో చెప్పి అతని మనస్సును ఓదార్చాను...అలా ఎన్నోసార్లు చెప్పాను...

ఎన్నాళ్ళని సత్యాన్ని మభ్యపుచ్చగలను?

*     *     *     *

కాలం గడచిపోయింది.

రోజులు, నెలలు, సంవత్సరాలుకూడా గడచిపోయాయి. మా సత్యం ఇప్పుడు మా యింటికి రావటమే అరుదు. వచ్చినా మా అమ్మా మానాన్నా వాళ్ళ ముఖాలుచాటేసేవారు. పలుకరించినా పలికేవారు కారు దగ్గరకు వస్తే అక్కడనుంచి లేచివెళ్ళిపోయేవారు, ఎంతచక్కటి మర్యాదా జరిగిందో చూడండి.

అలా మర్యాదాలుచేసినా సహించి పాపం నన్ను చూడందే ఉండలేక మాసత్యం నాకోసం వస్తూఉండేవాడు, ఇద్దరం కాసేపు మా భగ్నజీవితాలగురించి మాట్లాడుకొనేవాళ్ళం, మాకీ జీవితంలో ముక్తి ఉండదేమో అనుకొని నిరాశచెందేవాళ్ళం.

పోనీ అలాగైనా ఎన్నాళ్ళుగడిచింది?

కొన్నాళ్లే...

తరువాత ఒక రోజున సత్యం మాయింటికివస్తే మానాన్న ముఖం చిట్లించుకొని, అతికోపంతో ముఖమాటంలేకుండా, సత్యాన్ని మాయింటికి రావద్దని, ప్రజలన్యథా తలుస్తున్నారని నలుగురిలో వాళ్ళు తలలెత్తుకోలేపోతున్నారని, స్పష్టంగా చెప్పేశాడు...సత్యం ఇంకేమీ మాట్లాడలేకపోయాడు, ఏమిమాట్లాడతాడు?

ఆఖరుసారి నన్ను చూచిపోవాలని మేడమీదకు వచ్చాడు. నేను 'ఫాబెర్డు మహాశయుడువ్రాసిన మదామ్‌బవేరి అనే చక్కనినవల

చదువుచూ ఉన్నాను. అటువంటిచక్కని పుస్తకాలుంటే స్నేహితు లెందుకు ? అని అనుకుంటున్నాను. తన్మయంలో మునిగిపోయాను.

అంతలో నాప్రక్కన దీనంగా, కత్తిపెట్టి పెట్టినా రక్తపుచుక్క లేని ముఖంతో, నిలబడిన మాసత్యాన్ని చూచాను. ఏదోపరాభవం జరిగిందనుకున్నాను. నెమ్మదిగా అతనివద్దనుంచి సంగతులన్నీ తెలుసు కున్నాను.

సత్యం ! నేననుకున్నంతపనీ జరగింది. రాబోయే ఈ వినాశ నాన్ని తలుచుకుంటంలోనే నా హృదయం క్రుంగిపోతూఉంది. సత్యం నా మరణానికన్నా మాతల్లిదండ్రులు అంగీకరించారు కాని సం ఘాన్ని ఈమన్మాత్రంకూడా ఎదురించలేపోయారు...

ఇదేమిటమ్మా ! ఇలా నన్ను అన్యాయంచేయుటం భాగుందా ! అంటే...అమ్మా ! అంతా నీకర్మ నీ ముఖానికి పసుపు నుదుటికి కుం కుమ, తలలో పూవ్వులు, మెడలో మంగళసూత్రం ఈజన్మానికి ప్రాప్తి లేదమ్మా ! నీ నొసట తిలకంపెట్టిన కర్మదేవతే, వెంటనే చెరుపేసింది. ఆనందానికి మంగళ హారతిఇచ్చివేసింది...ఇంతకూ—కలకలలాడుతూ అల్లుడు మాయింట్లో తిరిగేప్రాప్తి మేము మాత్రం నోచుకున్నామా ! అంటూ శోకాలు ప్రారంభించేది.

కర్మ—కర్మ—ప్రతీది దానిమీాదకు యేసివేయుటమే: చిన్నకదా పిల్లల పెండ్లిండ్లుమాని శారదా బిల్లునుజడిసి, రజస్వలా (నంతర) వివా హాలుచేస్తున్నారంటే అందరి కర్మా ఒక్క—శారదాచట్టం మార్చివేసిం దనుకొంటాను. శారదాబిల్లు వస్తుందంటే రెండు మూడేండ్ల పిల్లలంత రకు పెండ్లిండ్లుచేసిన శుద్ధఛాందసుల పిల్లల కర్మలంతా ఒక్కసారిగా మారిపోయా యనుకుంటాను—ఏమిటో ఈవెఱ్ఱి ? ఏమిటో ఈమూర్ఖం

'అష్టవర్షా భవేత్ కన్యా' అనే సూత్రం ఏర్పరచి. ఎనిమిదేండ్లు దాటితే కన్యకాదని, కన్యాత్వందాటిపోకుండానే వివాహం చేయక పోతే, కన్యాదాతకు తత్ఫలితం ముట్టదని, ఈవెఱ్ఱి మొఱ్ఱికబుర్లన్నీ చెప్పి అమాయకులగు మా తల్లిదండ్రులను మోసంచేసి, నాకు ఎనిమిది సంవత్సరాలు రాకముందే పెళ్లిచేశారు. ఊహ తెలీని కాలంలో చేసిన ఆ బొమ్మలపెళ్ళిని ఊహిద్దామన్నా ఊహాకందటంలేదు—అలా ఎనిమి దేండ్లలో ఎందుకు చేశారంటే—అది శాస్త్రసంబంధ మనీ; 'కర్మ' అని—వైదికాచారం అంతా వెళ్లబుస్తారు.

నిజానికి మహమ్మదీయుల కాలంలో, పెండ్లికాని పిల్లలను మహమ్మదీయులు ఎత్తుకుపోతున్నారనీ, వారిబారినుండి తప్పించుకుంటానికి చిన్నతనంలోనే పెళ్ళిచేశారనీ, అందుకనే అటువంటి సూత్రాలు ఏర్పడ్డాయి పాపం! వీళ్ళకేం తెలుస్తుంది? తెలిసేటట్లు చెబుతేమట్టుకు వింటారా? వింటే వారిగొప్పతనం ఏముంది?

సత్యం! ఇంతకు వారినీ వీరినీ అనవలసిన పనేముంది? ఆనందం అనుభవించటానికి, స్వాతంత్ర్యం పొందటానికి, మనలో శక్తివుంటే, వాళ్లతో పనేముంది? వాళ్ళననవలసిన అవసరమేముంది?

అని నేనంటుంటే అతని కన్నులలో అద్వితీయమైన వెలుగు వెలిగింది. ఉత్సాహంలో అతనిముఖం ఎఱ్ఱబారింది...నళినీ! అయితే ఏంచెయ్యమంటావు మనంఎక్కడికన్నా...అంటూ సంశయించాడు. ఆసంశయాన్ని నేను పోగొట్టను...అవును సత్యం! ఎక్కడికన్నా వెళ్ళిపోదాం. జీవితాంతంవరకూ మొక్కవోని ఆనందాన్ని అనుభవిద్దాం స్వేచ్ఛావాయువుల్ని పీల్చుకుందాం. స్వతంత్రాకాశంమీద రెండు పక్షుల్లాగ, కెక్కా కెక్కా, ముక్కూ ముక్కూ, కేలించి, ప్రణయ గీతాలు పాడుకుంటూ ఎగిరిపోదాం.

నా హెచ్చరికవిని అతడు ముగ్ధుడైపోయాడు.

ఆనందం ఆశ్చర్యం—భయం—త్రిమూర్తుల్లాగ అతని హృద యంలో ప్రత్యక్ష మయ్యాయి...నళినీ! అంతపనేనా? అమ్మా! నాన్నా! చూస్తే కొంపమునిగిపోదూ! వాళ్లింక బ్రతకగలరా...అం టూ తడబడే గొంతుకతో చెప్పాడు...

స్త్రీసాహసి సే చేయలేని కార్యంలేదని మానత్యానికి తెలియ నందుకు నాలోనాకు నవ్వువచ్చింది. అతని వీపుమీదతట్టి—సత్యం! ఎంత వెఱ్ఱివాడవోయ్! అమ్మా నాన్నా మన ఆనందాన్ని చూస్తు న్నారు కాబట్టి, వారి ఆనందాన్ని మనం చూస్తామా! ప్రపంచం మన లను గడ్డిపోచక్రింద చూస్తే, ప్రపంచాన్ని మనం గడ్డిపోచక్రింద చూడొద్దూ!

చూడు సత్యం! ఆపిచ్చుకలు ఎంత ఆనందంగా ఒకయింటినుంచి మరొకయింటికి వెళుతూ స్వేచ్ఛాజీవనం అనుభవిస్తున్నాయో... కొలనులో బాతులు—చెట్లమీదపక్షులు—ఇళ్ళల్లోపిచ్చుకలు—అను భవించినంత స్వాతంత్ర్యంకూడా, నాటికంటే ఉత్తమ జన్మలమగు, మనం అనుభవించలే పోతున్నామంటే అది మన అశక్తిని తెలు పుతుంది.

నిజానికి మన సుఖదుఃఖాలకు కారణభూతు లెవరు? మనమే కదూ. సంఘం తయారుచేసిన సంకెళ్ళను, మనచేతులతో మనమే మన కాళ్లకు తగిలించుకుంటున్నాము. మానంతటమనమే బానిసలం అవు తున్నాము. తెలిసిందా సత్యం...అంటూ గుక్కతిప్పుకోకుండా ఉప న్యాసం ప్రారంభించాను.

అతని కన్నులలో ఒకవిధమైన వెలుగు కనబడింది...అయితే ఏమంటావు నళినీ అంటూ అనలేక అనలేక అన్నాడు. ఏముంటం ఏముంది—రేపురాత్రి రెండో ఆటకు సినిమాకని బయలుదేరి, ట్రెయి నెక్కి ఏకలకత్తాఅయినా వెళ్లిపోదాం. నామెళ్లో 5 వేల రూపాయల నగలున్నాయి. అవిపెట్టి ఏవర్తకమో, ఏదో మనకు నచ్చినపని చేసుకోవచ్చు. మళ్ళీ ఈఊరు జన్మలో చూడవద్దు. నళిని చచ్చిపోయిందని కన్నీటి తిలోదకం కన్న తల్లిదండ్రులు ఇచ్చేస్తారు. వారి హృదయాలు మన హృదయాలు శాంతిగా ఉంటాయి. అప్పుడు మన ఆనందానికి మనమే కారణభూతులౌతున్నాము. , మన ఆనందవనంలో మనమే విహరిస్తాము. మన ఆనందవాహినులలో మనమే • స్నానంచేస్తాము...అంటూ అతనికి ఉత్సాహాన్ని కలుగజేశాను. అతనిచేతికి ఊతగా చేయినిచ్చాను. అతడు ఒప్పుకున్నాడు...ఆమర్నాడురాత్రే మాప్రయాణం. ఇంట్లోనుంచి వెళ్ళిపోవటం. ఆనందం అనుభవించటం,...తృప్తితీరని నేత్రాలత్తో చూచుకున్నాము. మాసత్యం ప్రయాణ సన్నాహంలో వెళ్ళిపోయాడు...

అబ్బా! ఆడది అనుకోవాలేకాని అది ఆచరించని కార్యమేముంటుంది. స్త్రీసాహసించాలే కాని చేయలేని కార్యమేముంటుంది.

నేను మామేడ 'బాల్కనీ' మీద నిలబడి ఒక్కసారి ఈస్వార్థ సంఘాన్ని చూచాను. విరగబడి నవ్వాను పాపం! ఈవెర్రిసంఘం నాపాదాలను బంధించిందిగాని, నావేడిరక్తాన్ని ఉప్పొంగించకుండా చల్లార్చలేపోయింది. నన్ను అస్వతంత్ర బంధాలచే బంధించిందికాని, నామనస్సుయొక్క స్వతంత్ర విహారాన్ని అరికట్టలేపోయింది. నాతలమీద

నిప్పులవర్షం కురిపించిందిగాని—నాభావాలలోని చల్లదనాన్ని వేడిచేయలేకపోయింది.

రేపు మాసత్యానితో వెళ్ళిపోతున్నాను. స్వేచ్ఛాకాశంమీద విహంగదంపతుల్లాగ విహరిస్తాము. అప్పుడు మమ్మల్ని వీరేమిచేస్తారు.

అని అనుకుంటూ, ఆనందబాష్పాలు నాకనుకొలంకులలో దిద్దుకుంటూ, ఇంట్లోకి బయలుదేరారు, విన్నారా నాఉద్దేశాలు.



## 5

ఆనందంతో మేడమెట్లు దిగబోతున్నాను. వళ్లు పటపటా కొరుకుతూ నళినీ! అంటూ సింహగర్జనచేసే మానాన్నపిలుపు వినబడింది నాకాళ్ళను కాలసర్పంచే కట్టినట్లయింది.

వెనక్కు తిరిగాను, నళినీ ఇలారా అంటూ గదిలోనుండి పిలిచాడు మారుమాటాడలేపోయాను. నెమ్మదిగా లోపలకు వెళ్ళాను—చింత నిప్పులాగ మెరిసిపోయే ఆయనకన్నులను చూచిన నేను, ఆయన మాటలు వినలేదని ఎలా అనుకుంటాను.

నళినీ! విన్నాను, అన్నీ విన్నాను అర్థంఅయింది చదువుకున్నందుకు ప్రపంచజ్ఞానం చక్కగా గ్రహించాను. కులధర్మాలు, మతసాంప్రదాయాలు, మంచిచెడ్డలు, మానావమానాలు, మీాపనులకు అడ్డురావు. అతీతమైనవి మీాభావాలు. అనుభవసహితములైనవి మీా ఆచరణాలు ఓహోహో ఏమి నీతి ఏమిఖ్యాతి నీవంటి ఆదర్శప్రాయమైన స్త్రీ రత్నాన్ని పొందినందుకు మాజన్మలు తరించాయి.

అంటూఉంటే నాగుండె బద్దలైపోయింది. భయంచే ప్రతి అవయవం వణికిపోయింది. నోటమాటరాలేదు. అలాగే శిలావిగ్రహంలాగ నిలబడిపోయాను.

నళినీ! యావ్వనం— కనులుమూసి కనులు తెరిచేలోగా ఒకసారి మెరిసి మాయమైపోయే మెరుపు, ఆశలు—బలవంతంగా బంధించే పాశాలు, కామతృష్ణ—భయంకరమైన కాలసర్పం. అనురాగం—విరిగిపడే సముద్రతరంగం. జీవితంతుచ్ఛమైన నీటిబుగ్గ—ఇటువంటి సామాన్యవిషయాలు నీకు తెలియవా నళినీ! తెలిసేనా ఈ సాహస కృత్యాలకు పాలుబడింది—?

నళినీ ! బానిసులమగు మనలను భరించలేకే భరతమాత కన్నీరు కారుస్తూఉంది. దానికి తోడు మనవంటి పాపులనుకూడా భరించ మనటం న్యాయమహా!

ఏదీ! 'ప్రేమ—ప్రేమ' అని పెద్దపెద్ద ఉపన్యాసా లిచ్చావు- ప్రేమతత్వం నిజంగా తెలుసునేమో నా ముఖంచూచిచెప్పు...సత్యా న్ని ప్రేమిస్తున్నావంటే కనబడని సత్యం మనస్సుని ప్రేమిస్తున్నావా? కనబడే సత్యం శరీరాన్ని ప్రేమిస్తున్నావా! ఆలోచించు...శరీరాన్ని ప్రేమించేది కామమో...ప్రేమో—యోచించు.

నళినీ! ఇంత ప్రపంచకంలో ఒకేపురుషునిపై నీచూపులను నిలి పావంటే—అది కామ సమ్మిశ్రితమైన ప్రేమ అవుతుందేగాని— నిర్మల ప్రేమకాదుసుమా.

కులమతభేదాలులేకుండా ప్రపంచకంలోని ప్రాణికోటినంతనూ ఒకే విధంగా ప్రేమిస్తేనే—ఆ ప్రేమనిర్మలత్వం పొందుతుంది. లేక పోతేకాముకత్వం పొందుతుంది. మన దృష్టి ఎంత విశాలమైతే మన ప్రేమఅంత విశాలమౌతుంది. మన దృష్టి ఎంత సంకుచితమైతే మన ప్రేమఅంత సంకుచిత మౌతుంది...

అంటూ ఇంకేవేవో చెప్పబోతున్నాడు—నాకు నామీద, నాయౌవన సౌందర్యం మీద, చెప్పలేనంత అసహ్యం కలిగింది. మా నాన్నమీద తప్పుకోలేనంత కోపంకలిగింది...కోపంకలిగింది—కోపం కలిగిన మనస్సు కొన్నిమాటలైనా వెలికక్కకుండా ఉంటుందా—

తోకతొక్కిన తాచులాలేచాను.

నాన్నగారూ! పెండ్లిచేసుకొన్న భర్తను భార్య ప్రేమించటం కూడా తప్పేనా? భార్యాభర్తలను అనురాగంతో బంధించే సూత్రం కామసూత్రమేకాని, ప్రేమసూత్రం కాదా? ఏమిటండీ అన్యాయం—

తలనెరిసిన తాతకూడా అవ్వతో ఆనందంగా ఉంటానికి అభిల షిస్తాడే— నడిప్రాయంలో ఉన్న స్త్రీ తన యావ్వనసౌందర్యాన్ని వివాహించే పవిత్రం చేసుకుంటం ఘోరం అయిపోయిందా? అన్నం పున్నం ఎరుగని ఆరేండ్లపిల్లకు; పప్పూబెల్లాలూ పెట్టి, బొమ్మలుచేతికిచ్చి, పెండ్లిండ్లుచేయుటం, వారిభర్తలు పోయాక వారిని విధవలనుచేయుటం న్యాయమైపోయిందా? ధర్మసంస్థాపనార్థం యుగయుగాలకుపుట్టే మహానుభావులందరూ ఈసంఘశాసనకర్తలేకదూ.

ఎందుకువచ్చిన మాటలండీ నాన్నగారు, మనకడుపు నిండుతే ఎదటివాని కడుపుమంట చల్లార్చటానికి ప్రయత్నం చేస్తామా? మనం మాత్రం అనందంగాఉంటే ఎదటివారెలాఉంటే మనకెందుకు?

అంటూ ధోరణి ప్రారంభించాను. ఆయన దానితో ప్రళయ కాల రుద్రుడయిపోయాడు.

నళినీ! లోకంలో ఉన్న మనం. లోకాన్ని అనుసరించి ప్రవర్తించా కాని, లోకాతీతంగా ప్రవర్తించరాదు. నీమాత్రం జ్ఞానమూను లేక కాదు. ఆచరణకు అనుగుణంగాలేని ఆలోచనలెందుకు?

ఇంతకూ నళినీ! జీవితం నియమబద్ధం, నియమశూన్యమైన జీవితాన్ని పండితులు మన్నించరు పండితులకు ప్రపంచకానికి, లెక్కచేయుటం మానవధర్మం. అటువంటి మానవధర్మాన్ని అనుసరించి ఇంట్లో ఉంటావా సరే...లేకపోతే నీయిష్టంవచ్చినట్లు నీవు వెళ్ళిపోవచ్చును. నాకభ్యంతరం ఏమీలేదు నాఇనప పెట్టెలో 20 వేల రూపాయిల బంగారంఉంది. అదితీసుకో, ఇంకాడబ్బుంది అవీ తీసుకో— మిగిలిన ఆస్తిఅంతా వ్రాసేస్తాను. ఆవిషయం నీవు ఆలోచించక...

కాని నళినీ! ఈజీవితంలో నీతల్లిదండ్రులను మరల నీవుచూడ లేవు. నీవేకాదు. ఈప్రపంచంలో బ్రతికిఉన్న ఏప్రాణీచూడలేదు...

తెలిసిందా నళినీ! అవమానంతో బ్రతికేదానింటే, కా స్తప్రాణము పంచభూతాలలో కలిపేసుకుంటం మంచిది....

అంటుంటే ఆయనముఖం చూడలేపోయాను. నాగురించి నా తల్లిదండ్రులగురించి నేనే ఎందుకు నాశనంకాకూడదూ? ప్రేమతత్వం తెలియని లోకంగురించి బాధపడే దానికంటే, ఈ లోకాన్నే విడిచి వెళ్ళిపోతే మంచిదికాదూ? బ్రతికి యావజ్జీవితాన్ని భగ్నంచేసుకొనే దానికంటే—ఈతుచ్ఛశరీరాన్ని మట్టిలో కలిపివేస్తే మంచిదికాదూ?

అని ఆలోచించాను. ఒకనిశ్చయానికి వచ్చాను. నాన్నగారూ! మీ యిష్టంవచ్చినట్లు చేస్తాను. అనిచెప్పేసి అక్కడ ఒక్కక్షణమైన ఉండలేకుండా, నాగదిలోకి వెళ్ళిపోయాను. నాగదిలో ఎన్నికన్నీళ్ళు కార్చానో; బరువెక్కిన నాతలగడకుమాత్రం తెలుసును.

పాపం! నన్ను తీసుకొని వెళ్లిపోదామనుకదా అని ఆతృతతో, ఆనందంతో; మా సత్యం రాత్రివచ్చాడు...మా నాన్న మమ్మలను చూస్తూనే ఉన్నారన్న సంగతి నేనెలా మరచిపోతాను.

ప్రయాణ సన్నాహంలో లేని నా వాలకంచూచి ఆశ్చర్య పోయాడు. ఎఱ్ఱవారిన కనులు, పొంగిన రెప్పలు. చూచి నిర్ఘాంత పోయాడు హృదయ పరివర్తనం ముఖంలో కొంచమైనా తెలియక పోదుకదూ. అందుచేత నాలో ఏదో...గ్రహించి మాత్రం ఏం చేస్తాడు. విచారిస్తాడు. కన్నీరు కారుస్తాడు...ఇంతేగా—

జరిగినవన్నీ చెప్పి సత్యాని హృదయం నొప్పించకూడదను కున్నాను: కొంతవరకైనా నొప్పించక తప్పదు.

అతనితో మరొకచోటికి ప్రయాణం చేయలేను సరేకదా? ఈ జీవితంలో అతనితో కలసే ఉండలేనని, దానికి నన్ను అన్యథాతలచ వద్దని, కన్నీటితో ప్రార్థించాను. అడిగిన ప్రశ్నలకు సమయానుకూల

మైన జవాబులు చెప్పాను అతనికి మాత్రం తృప్తిలేదు. దానికి నేనేం చేస్తాను.

ప్రయాణాన్ని మార్పించటమే కాకుండా, అతని జీవితాన్ని కూడా మార్పించటానికి నేను వెనుదీయలేదు. నా భగ్నజీవితంలో అతని ప్రేమసౌధాన్ని నిర్మిద్దామనుకున్నాను.

అక్కడనుంచి అతణ్ని వేరే పెండ్లిచేసుకో మని బలవంతం చేశాను...సత్యం వీలులేదంటే వీలులేదన్నాడు. నన్ను నిర్మలంగా ప్రేమిస్తే—ఆ ప్రేమకు సాక్ష్యంగా మరొకరిని పెండ్లిచేసుకోమన్నాను. అలా చేసుకుంటే అతనిని జీవితకాలం ప్రేమిస్తానని, అతని ఇంటికి వెళతానని, అలా కానినాడుఆరోజే విషంతాగి ప్రాణాలు విడిచెస్తా నని, నొక్కి చెప్పాన. దానితో ఏంచెయ్యాలో తెలీని విపరిస్థితు లలో పడిపోయాడు.జాలిగా ప్రార్థించాడు. తన నటువంటి పాపపు కృత్యానికి పాలుచేయొద్దన్నాడు...ఏడ్చాడు...మొత్తుకున్నాడు తనను కూడా బ్రహ్మచారి జీవితాన్ని గడపడానికి అనుజ్ఞ ఇమ్మన్నాడు... ఎన్నో ఎన్నో చెప్పాడు—అన్నింటికీ అన్నీ చెప్పి అతణ్ని ఒప్పించాను.

కొన్నాళ్ళు గడిచాయి

మాసత్యం పెళ్ళిఅయిపోంది.

ఆ పెళ్లికి నేనూ వెళ్లాను. అతడు నాముఖం చూచాడు. నే నెలా అక్కడ నిలువ కలిగానా అని ఆశ్చర్యపోయాడు. నా కన్నుల అనుకోకుండా నీరు నిండాయి, ఆదృశ్యాన్ని చూచిన అతని కన్నులూ తడివాగాయి అతడు వంగి తన భార్యామెడ్లో మంగళసూత్రం కట్ట లేపోయాడు, అతని చేతులు వణికిపోయాయి. నా. వంకచూచాడు...

'పోం కట్టేయి. ఇటువంటి సమయంలోనే ధైర్యం ఉండాలి... నీవు నామాట విన్నావు. నిజానికి నీకంటే నాకు ప్రియుడులేడు' అనే భావాలు నాకన్నులలో చూపించాను.

అతనికి ఎక్కడలేని ధైర్యం వచ్చింది—భార్యామెళ్ళో మంగళ సూత్రం కట్టాడు. సముద్రంలో మునిగిపోయే వానికి చేయూతనిచ్చి నట్లు, క్రుంగిపోతో అతని హృదయానికి ధైర్యం కలిగించాడు.

మా సత్యం ఇప్పుడొకం ఇంటివాడు

సంసారం చేసుకుంటున్న గృహస్థు—

నేనో ఏకాకిని...' భగ్నజీవి ' ని—

అతడు మాత్రం నాగురించి సంసారం జేస్తున్నాడన్నా మాటే కాని—' భగ్నజీవి ' కాదని ఎలా అంటాము.

మొత్తానికి నేటివరకు అంతా బ్రతికె ఉన్నాము. మాకష్టాలల్లో మేము క్రుంగిపోతూనే ఉన్నాము.

ఇలా ఎంతకాలమో !

మీరే చూస్తారుకదూ !



# 6

రెండు సంవత్సరాలు గడిచాయి.

రోజురోజూ క్షీణించుకుపోతున్నాను.

ఎందుకో ఎవరికి తెలుస్తుంది ?

డాక్టర్లు మాత్రం విడువకుండా మందులిస్తున్నారు.

జబ్బు లేకపోయినా గొప్పవారికి • మందుల లోటేమిటి కాలం గడుస్తున్నకొలదీ నా హృదయ మందిరంలో, మృత్యుదేవత నివాసం ఏర్పరచుకుంటూఉంది...

సత్యాన్ని మా యింటికి రానివ్వలేదు...

మేమిద్దరం మళ్ళీ కలుసుకోకూడదనుకున్నాము.

అలాగే కలుసుకోలేదు.

కష్టాలలోనే మా జీవితాలను ముగించుదా మనుకున్నాము. మా జీవితాలను విషాదాంతం చేయాలనుకున్నాము.

* * * *

ఆరోజు మా తెలుగువారికి తొలిపండుగ. నా జీవితానికితుది పండుగ.

మా సత్యానికి ఆడపిల్ల పుట్టింది...నాయందుండే ప్రేమచే అతడు ఆబిడ్డకు నాపేరే పెట్టాడని విన్నాను. వాళ్ళను ఒక్కసారి చూడాలని పూర్తిగా వాంఛకలిగింది. మానాన్నగారిఆజ్ఞ తీసుకున్నాను. పిల్లకి బొమ్మలు కొన్నాను. వస్తువులు చేయించాను. ఎంతకాలానికో అద్దంలో మళ్ళీ చూచుకున్నాను. పాలిపోయిన బుగ్గలు, లోతుకుపోయినకళ్ళు, చిక్కిపోయిన శరీరం, చూచుకుంటూఉంటే నాలో

నాకు నవ్వువచ్చింది. ఎంత ఆనందంగా ఉండేవానిని ఎలా మారిపో యాను. సంతోషం నగంబలం అన్నమాట ఊరికనేపోతుందా ? అబ్బా! ఎంత చిక్కిపోయాను...

నిజానికి నాకంటే మాసత్యానిదే ఎక్కువత్యాగం. అతనికి ఇష్టంలేకపోయినా, నాగురించి పెండ్లిచేసుకున్నాడు. నాగురించే పెండ్లాముతో కాపురంచేశాడు. తుదకు పిల్లనికూడా కన్నాడు. అటువంటి సత్యం నిర్మలప్రేమ ఎన్నిజన్మాలికైనా మరిచిపోగలనా ?

ఈ ఆలోచనలలో రాత్రి అయింది.

మానాన్నగారితో నాప్రయాణం చెప్పాను.

వంటెద్దుబండివచ్చి ఇంటిముందు నిలబడింది. ఆనందంతో శాన్క లన్నీ తీసుకువెళ్ళాను...

* * * *

ఆనందంవెనకాలే విషాదం తొంగి చూస్తుందన్నసంగతి నా టితో రుజువు అయింది...

బండి కొంతదూరంలో ఆప్షాను.

మాసత్యం ఏమిచేస్తుంటాడో చూద్దామని, అతనికి నారాకచేత అత్యాశ్చర్యం కలిగిద్దామని, కిటికీలోనుంచి తొంగిచూచాను.

ఆహా ! ఏమిటా ప్రణయదృశ్యం. నాకనులు నేను నమ్మలే పోయాను. ఇప్పటికీ మరచిపోవాలన్నా మరచిపోలేపోతున్నాను. ఆదృ శ్యమే ఈ నాజీవితాన్ని పూర్తిగా భగ్నంచేసింది. నాశనంచేసింది...

ఏమిటా దృశ్యం ?

సత్యం తన పాపాయినెత్తుకొని ముద్దాడుతూ ఉన్నాడు. సత్యం భార్య సత్యానికి తమలపాకులు మడచి అందిస్తూఉంది. అతడు వేసుకుంటూఉన్నాడు. తల్లిదండ్రులమధ్య పాపాయినవ్వుతూఉంది. వాళ్ళు బ్రహ్మానందం అనుభవిస్తున్నారు,

'అబ్బా ! ఏమిటా ఆనందం, చెప్పటానికి వీలులేదు. కాలము గడుస్తున్నకొలదీ సత్యం తనభార్యను ప్రేమించగలుగుతున్నాడు. ఇక ముందు అతని జీవితానికి ఏమీ భయంలేదు. అతని ఆనందానికి లోటు లేదు. వారిమధ్యనువెళ్ళి వారి ఆనందానికి అంతరాయం కలిగించకూడ దనుకున్నాను—

నాకళ్ళు తిరిగిపోయ్యాయి.

నాతలమీద బండపడిపోయింది.

అక్కడ ఒక్కక్షణంకూడా నిలువకుండావెళ్ళి బండిలోకూర్చుని పోనీయవోయ్ ! బండి. పోనీయ్, అంటూ అతి ఆతృతతో అన్నాను. బండివాడు ఆశ్చర్యపోయాడు.

ఇంటికి వెళ్ళిపోయాను.

సామానైనా దింపమనకుండా, గబగబా మేడెక్కిపోయాను. మా అమ్మా నాన్నా నావిచిత్రప్రవర్తనకు ఆశ్చర్యపోయారు.

నన్నెన్నో ప్రశ్నలువేశారు. జవాబియ్యలేదు. సత్యం ఏదో పరాభవం చేశాడనుకున్నారు. నిజానికి సత్యం హృదయం వాళ్ళకెలా అర్థం అవుతుంది. అతడు భార్యతో అలా నటిస్తున్నాడో, నిజంగా ప్రేమతో ఉన్నాడో నాకుమాత్రం ఎలా అర్థం అవుతుంది. ఎవరిహృదయము ఎవరు అర్థంచేసుకోగలరు ?

ఆనాడే నేను మంచం పట్టాను.

నేటికి రెండు నెలలయింది.

మంచంమీదనుంచి లేవలేదు. లేవబోను, ఎలావేస్తాను. నాకు ఆత్మహత్యచేసుకుంటం ఎంతమాత్రం ఇష్టంలేదు. అదిమూర్ఖులు చేయవలసినపని. మేటర్‌లింక్ అన్నట్లు బ్రతికిఉండి కష్టాలను భరించటం కష్టంగాని, చనిపోవటం చాలతేలిక——

చచ్చేవరకు బ్రతికి కష్టాలు భరించి, కృసించి, కృసించి ప్రాణాలువిడిచేద్దామనుకున్నాను. నాముఖలక్షణాలబట్టి మాఅమ్మా నాన్నా వాళ్ళు నాఉద్దేశం కొంతవరకు గ్రహించకపోలేదు.

గ్రహించిమాత్రం ఏంచేస్తారు ? చచ్చినవాళ్ళను ఎవరాపుతారు?

కాలం గడుస్తున్నకొలది నాహృదయం బరువెక్కిపోతూ ఉంది నాహృదయంలో మృత్యుదేవత నివాసం ఏర్పరచుకొంది...నాప్రతి అవయవం నానుంచి వేరై పోతున్నట్లు, అపరమితమైన బాధపెడుతూ ఉన్నాయి.

నా నాడి కొట్టుకుంటం తగ్గిపోతూఉంది. నాకుఊపిరి బాగా ఆడటంలేదు. నాగొంతుకు ఎవరో నులువుతున్నట్లు, ఉక్కిరి బిక్కిరి అయిపోతున్నాను.

ఇలా ఎంతకాలమో బ్రతకలేను. బ్రతకలేనని విచారించటం లేదు. నామరణశయ్య నేనే పరచుకొన్నప్పుడు, నాశవాన్నిచూచి నేనే కన్నీరు కార్చటం ఎందుకు ?

కాని ఇలా ఎంతకాలం బ్రతుకుతానో చెప్పలేను...బ్రతికే వరకు నాకథ ఇలా వ్రాస్తాను. ఇది మహాత్ముని ఆత్మకథ కాదు. దేశోద్ధారకుని జీవితచరిత్రకాదు. మతోద్ధారకుని మనః ప్రవర్తనకాదు.

కులోద్ధారకుని గుణశీలనకాదు. పాఠకుని మనసు కరిగించే మహా భాష్యంకాదు. ప్రపంచక ప్రఖ్యాతిపొందిన భగవద్గీతకు వ్యాఖ్యగాదు తుదకు చక్కని నవలాకాదు——తీయని కథాకాదు——

ఇంకేమిటంటారో?

నా 'భగ్నజీవితం'

పిశాచాలు నృత్యంచేసే శ్మశానభూమి

నాకాటిలో కాలిపోయే శవపు వాసన

నా నాశనంలో పోగుబడిన బూడిదకుప్ప

ఆత్మవంచకుల హృదయాల్లో బయలుదేరిన అగ్నజ్వాల.

అభాగినుల కన్నులజారే కన్నీటి కాలువ——

కపట నటకుల తలపైన సుత్తిదెబ్బ.

నావంటి 'భగ్నజీవుల' ను అర్ధరాత్రి సమయంలో ఓదార్చే ఓదార్పుమాటలు——అంతే...

కాని ఒక్క ప్రశ్న——

నా కథంతా చదివారు.

నా హృదయం కొంతవరకయినా గ్రహించారు.

నా భగ్నజీవితం తలుచుకొని సహృదయులై రెండు కన్నీళ్ళు కారిస్తే కార్చవచ్చును. లేకపోతే లేదు. దానికి నాకే మీ విచారం లేదు——

కాని

ఇలా నాజీవితం భగ్నం అయిపోవటానికి కారణం ఎవరు?

నా నాశనానికి కారణం.

నేనా?

నాకర్మా?

ఈ లోకమా ?

దయచేసి చెప్పండి...మరో ప్రపంచంలోఉన్న నా ఆత్మైనా వింటుంది...

ఏమంటారు...

అబ్బా ! నాహృదయాన్ని ఎవరో నొక్కివేస్తున్నారు...నా ఊపిరి గొంతుకలోనే కొట్టుకుంటూఉంది. ఉచ్ఛ్వాశ విశ్వాసలు ఆగి పోతూ ఉన్నాయి...నా...కలంకూడా ఆగిపోతూఉంది...

అయ్యో ! భగవంతుడా ఇంకనేను చచ్చిపోతున్నాను కాబోలు-

నా సత్యాన్ని—నా జీవితాన్ని—నా ప్రాణప్రియుని—నా భర్తను...చూడలేను కాబోలు...

ఈ పుస్తకం చదువుతున్న సత్యం ఎన్నికన్నీళ్ళు కారుస్తాడో... పాపం...నాహృదయాన్ని తెలుసుకొన్న మా అమ్మా నాన్న వాళ్ళు ఎంబాధ పడతారో...పాపం...

ఎవరెలాగున్నా...నా గుండెలోనుంచి నాబాధ వేగె పోతూ ఉంది...

నాశరీరంలోనుంచి నాప్రాణం వేళ్ళె పోతూఉంది—

అదేమిటి ?

వాళ్ళెవరు ?

ఏదో నీలినీడల కదులుతున్నట్లుందే...

ఓహో... తెలిసింది...

ఇంక మహాప్రపంచకంలోకి వెళ్ళిపోతున్నా...

ఇంక ఆ వల్లెముసుగు వేసుకున్నవారు నా స్నేహితులొచ్చారు కాబోలు...

అబ్బా! ఎంత భయమేస్తుంది...

రామ!—రామ!!

సత్యం...సత్యం...

కలవా...సత్యం...

స...త్యం...

క...ల...వా

స...త్యం—

భ గ్న జీ వి—

నీ న లి ని —

సం పూ ర్ణ ము.



# హెచ్చరిక:

సుప్రసిద్ధ నటీనటులగు సి. యస్. ఆర్. గండికోట, రేలంగి,
బాబ్జి, సుభద్ర, గోవిందమ్మ మొదలగు స్క్రీను తారా
గణంతో నటింపబడి సినీక్రిటిక్ల ఆదరణతోపాటు
వివిధ పత్రికా ప్రశంశలను కూడ వరసగా
అందుకొన్న ఆధునిక సమస్యలను సంస్క-
రించే సాంఘిక స్టేజినాటకం.




అచ్చులోవుంది గాన నేడే కాపీలకోసం త్వరపడండి.

---

మీకు పుస్తకములు కావలసినను—

## చంద్రయ్య అండుకో.,

బుక్ సెల్లర్స్: రాజమండ్రి.